























**గుర్తుంచుకోవాల్సిన పెప్సొడెంట్ సూత్రం.**

స్వీట్లు తిన్నప్పుడల్లా పళ్ళు బ్రష్ చేసుకోండి నోటిలోని క్రిములకి పెరిగే అవకాశం యివ్వకండి.




కొత్త

**పెప్సొడెంట్** సమర్థవంతంగా క్రిముల్ని దూరంచేసే టూత్‌పేస్ట్

LINTAS HLL P 18 AS 20 1813 TL

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన.



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక స్వాతి

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పి.బి.నెం.339 విజయవాడ-520 002





స్వాతి పాఠక దేవుళ్లకు
అపూర్వమైన అద్భుత బహుమతులు

విదేశాల్లో విహారయాత్ర

స్కూటర్, మోపెడ్‌ల వాహనయోగం



నాణ్యమైన బంగారు ఆభరణాలు



ఇంకా ఎన్నో విలువైన బహుమతులు

స్వాతి సపరివార పత్రిక నూటికి నూరుపాళ్ళూ పాఠకుల పత్రిక. ఎప్పటికప్పుడు పాఠకుల అభిరుచులకనుగుణంగా, పాఠక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని, పత్రికను తీర్చిదిద్దడమే మా అనవరత దీక్ష, కృషి.
ఆ కృషిలో భాగంగానే- మా పాఠకుల గురించి వివరాలు తెలుసుకొనేందుకు ఒక సర్వేని నిర్వహించదలచాం.
ఈ సర్వేలో పాల్గొనే పాఠకులు పై బహుమతులు పొందడానికి అర్హులు.
కనుక స్వాతి పాఠక మహాశయులారా! ఈ సర్వేలో ఎక్కువ సంఖ్యలో పాల్గొని మాకు సహకరించ ప్రార్థన.

పూర్తి వివరాలకు-

మార్కెట్లో సిద్ధంగా వున్న స్వాతి సపరివార పత్రిక చూడండి.

మిస్ కాకుండా బహుమతులు అందుకోండి

# సరికొత్త ప్యారీస్ మిల్క్ బిస్కట్ల పొడుపు కథ












ప్యారీస్ మిల్క్ బిస్కట్లలో
చాలాచాలా మార్పులే వచ్చాయి.
ఇది కేవలం ఆకర్షణీయమైన
సరికొత్త పాకెట్ మాత్రమేకాదు.
లోపల బిస్కట్ల నాణ్యం కూడా మెరుగు అయింది!

సరికొత్త సుసంపన్నమైన, పౌష్టిక విలువలున్న బిస్కట్లు.
లోగడకన్నా యిప్పుడు మరింత కరకరగానూ, మరింత తాజాగానూ,
మరింత రుచికరంగానూ వుంటాయి!



## చందాదారులకు గమనిక!

చందమామకు వేలకొలది చందాదారులు ఉన్నారు. కాబట్టి, కవర్ల మీద చిరునామా సిద్ధం చేయడం మొదలైనవన్నీ ప్రతినెలా మొదటివారంలోనే పూర్తి చేయవలసి ఉంటుంది. పత్రిక మీకు ఆలస్యం కాకుండా సకాలంలో అందాలంటే మీ చిరునామాలో మార్పులేమైనా వుంటే వెంటనే మాకు తెలియపరచడం చాలా అవసరం. ఈ విషయంలో మాతో సహకరించాలని కోరుతున్నాము.

డాల్టన్ ఏజన్సీస్
సబ్‌స్క్రిప్షన్ సెక్షన్
చందమామ బిల్డింగ్స్
మద్రాసు – 600 026





ARTIG/PCL/993





జవాబు: అవును, ఆ మూడూను!

## పవిత్రబైబులు దీనిని పేర్కొంది.

## ప్రాచీన ఆయుర్వేదం దీనిని సిఫార్సు చేసింది.

## ఆధునిక విజ్ఞానం దీనిని ఆమోదిస్తుంది.



## ఆలోవేరా
## సున్నితమైన చర్మంకోసం, ప్రకృతిసిద్ధమైన అద్భుత వనమూలిక.

పురాతనకాలంనుంచీ, ఆలోవేరా అనే అద్భుతమైన మొక్కకు, అనన్య సామాన్యమైన నివారణ శక్తిగలదనీ, చర్మాన్ని మరింత మెరుగుపరచడంలో సాటిలేనిదనీ, పేరు వుంది. చర్మాన్ని పరిపోషించడంలోనూ, టిష్యూం నిర్మాణంలోనూ, తేమ ఆరకుండా చూడ్డంలోనూ, చల్లగా వుంచడంలోనూ, పునరుద్దీపనలోనూ, దీనికి అపారఖ్యాతి వుంది.

**భారతదేశంలో తొలిసారిగా ప్రవేశపెడుతున్నారు,**
**ఒక అద్వితీయమైన,**
**నాచురల్ బేబీ మసాజ్ ఆయిలు– 1st స్టెప్,**
**ఆలోవేరాతో పరిపుష్టమయింది.**




1st స్టెప్‌లో, ఆలోవేరా పరిశుద్ధసారంతోపాటు, చర్మాన్ని మరింత మెరుగుపరిచే బాదాం, మంచి గంధపు నూనెలు కూడా వున్నాయి. ప్రకృతిసిద్ధమైన ఈ పదార్థాలన్నీ కలిసి, పసిపాప కోమల చర్మాన్ని తేమగా వుంచుతాయి, చర్మాన్ని సంరక్షించి మరింత పటిష్ఠంగా చేస్తాయి. దానిని మరింత మృదువుగా, మెత్తగా, కాంతివంతంగా వుంచుతాయి. ప్రతి రోజూ మీ పాప శరీరాన్ని 1st స్టెప్‌తో మృదువుగా మాలీసు చెయ్యండి, తేడా స్వయంగా చూడండి. 1st స్టెప్ చర్మాన్ని పరిపోషించే నేచురల్ బేబీ మసాజ్ ఆయిలు– తల్లి ప్రేమలా మృదువైనది. స్వచ్ఛమైనది.



ఇప్పుడు పుట్టివుంటే ఎంత బాగుండును అని మీకూ అనిపిస్తుంది

Renaissance B/008/92

CHANDAMAMA PUBLICATION

# చందమామ

సంస్థాపకుడు: 'చక్రపాణి' సంచాలకుడు: నాగిరెడ్డి

## భూగోళ పరిరక్షణ!

జూన్ నెలారంభంలో బ్రెజిల్ రాజధాని నగరం రియో డీ జనీరోలో 'భూగోళ పరిరక్షణ' గురించి చర్చించడానికి ప్రపంచ దేశాల శిఖరాగ్ర సమావేశం జరుగనున్నది. ఈ సమావేశంలో ప్రపంచ దేశాల నాయకులందరూ పాల్గొంటున్నారు.

ఇటీవల పత్రికలలో తరచూ, 'వెచ్చబడిపోతూన్న భూమి' 'ఓజోన్ పొరలో రంధ్రాలు', 'వాతావరణంలో మార్పు' మొదలైన శీర్షికలతో వార్తలు వెలువడుతున్నాయి. ఇవన్నీ కూడా రోజు రోజుకూ ప్రమాదకరంగా పరిణమిస్తూన్న పర్యావరణ కాలుష్యాన్ని వివరిస్తున్నాయి. మనమూ, మన ముందుతరాల వాళ్ళూ భూగోళ పరిరక్షణకోసం తీసుకోవలసిన చర్యలను గురించి హెచ్చరిస్తున్నాయి!

క్రమంగా అంతరించిపోతూన్న అడవులూ, అనూహ్యకరమైన పారిశ్రామికీకరణ కారణంగా పర్యావరణ కాలుష్యం ఏర్పడుతున్నది. అరు ఋతువుల కాలచక్రం సైతం గతి తప్పే ప్రమాదం అసన్నమవుతున్నది!

ప్రకృతిలో సమతౌల్యం కొనసాగితేనే, భూమిమీద జీవరాశులూ, చెట్టు చేమలూ క్షేమంగా ఉండగలవు. సమతౌల్యం కొనసాగడానికి, అడవులు అత్యంత అవసరం. అయితే, అడవుల నిర్మూలన సాగుతున్నంత వేగంగా మనదేశంలో మొక్కలు నాటడం జరగడంలేదు. దీనికొక పరిష్కార మార్గం కనుగొని తీరాలి. అందుకే ఇటీవల— ఒక చెట్టు నరికిన చోట రెండు మొక్కలు నాటాలన్న ప్రచారం ప్రారంభమయింది. ఇది ఎంతైనా సంతోషించ తగ్గ విషయం. ఈ విషయంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్రం—బంధుమిత్రులస్మృతి చిహ్నంగా మొక్కలు నాటి 'స్మృతి వనాలను' సృష్టించే ఉదాత్త పథకాన్ని ప్రోత్సహిస్తున్నది. ఇది ఎంతైనా ప్రశంసించతగినది; ఇతర ప్రాంతాలలో కూడా సాధ్యమైనంతలో అందరూ అచరించతగినది!

సంపుటి 90 జూన్ '92 సంచిక 6

విడి ప్రతి: 4-00 :: సంవత్సర చందా: 48-00



CHITRA

# యువ్వనంతో మెళవించే రంగు





మజా అంటే మజా.
స్కూల్లో మహా సరదా.
కొత్త ఫెవిక్రిల్ స్టూడెంట్స్
పోస్టర్ కలర్స్.
కళ్ళకి ఆనే చల్లని
ఛాయల అందం.
ఎంతో క్రీమీ క్రీమీ,



రంగు రంగుల మెరుపులు.



చిలకమ్మ గ్రీన్. ధమాకా రెడ్.
బలే బలే బ్లూ.
ఇక ఉండనే వుంది స్నోయీ వైట్!!



గబగబా వెయ్యండి డ్రాయింగ్.
చకచకా నింపండి కలర్స్.
కొత్త ఫెవిక్రిల్ స్టూడెంట్స్ పోస్టర్
కలర్స్‌తో మజాయే మజా,
ఉషారే ఉషారు!



(ష్ ష్! అమ్మ ఏమీ అనదులే! ధర చూసి
సరే నంటుంది. నువ్వేసిన బొమ్మ చూసి భలే అంటుంది!)

ఉచితం
పెయింట్-ఎ-పోస్టర్

ఈ కూపన్ యీ చిరునామాకు వెంటనే పంపండి:
ఫెవిక్రిల్, పోస్ట్ బాక్స్ 17437 అంధేరీ (ఈస్ట్),
బొంబాయి-400 059.

పిడిలైట్ ®
కొత్త
ఫెవిక్రిల్
స్టూడెంట్స్
పోస్టర్ కలర్స్




ఫెవికాల్ బ్రాండ్ ఎడ్హెసివ్‌లు తయారుచేయువారైన పిడిలైట్ వారి ఉత్పాదన.

everest/91/PIL/177 a

నాకు వెంటనే ఉచితంగా ఒక ఫెవిక్రిల్ పెయింట్-ఎ-పోస్టర్ సెట్ పంపండి.

పేరు ______ వయస్సు ______
అడ్రసు ______
______
స్కూలు ______

CDM



# పాతపేరుతో కొత్తదేశం!

దౌదాపు యాభై ప్రపంచదేశాల ప్రతినిధుల సమక్షంలో గత ఏప్రిల్ 27వ తేదీన యుగోస్లావియా ఫెడరల్ పార్లమెంటు సమావేశమై, నూతన రాజ్యాంగాన్ని ప్రకటించింది!

ఈనాటి ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ యుగొస్లావియాలో మునుపటి ఆరు రిపబ్లిక్కులలోని రెండు రిపబ్లిక్కులు—సెర్బియా, మాంటినీగ్రో మాత్రమే వున్నాయి. మిగతా నాలుగు ఒక సంవత్సరం కిందట విడిపోయాయి. ఆరునెలలపాటు అక్కడ జరిగిన జాతి కలహాలలో పలువురు ప్రాణాలు కోల్పోయారు. ఇళ్ళు కోల్పోయారు. మరి కొందరు పొరుగు ప్రాంతాలకు వలస వెళ్ళారు.

'యూరోపియన్ కమ్యూనిటీ' జోక్యం కల్పించుకుని, 15 సార్లు శాంతి ఒప్పందాలను కుదిర్చింది కాని, అవి కొన్ని రోజులు కూడా కొనసాగలేదు. ఆఖరికి ఐక్యరాజ్య సమితి శాంతి పరిరక్షక దళాలను పంపడానికి అంగీకరించింది. మార్చి నెలలో మన దేశానికి చెందిన లెఫ్టినెంట్ జనరల్ సతీష్ నంబియార్ నాయకత్వంలో, 17 దేశాలకు చెందిన 14,000 మంది సైనిక దళం అక్కడికి చేరింది.

అదే సమయంలో, ముస్లింలు అధిక సంఖ్యాకులుగా వున్న బోజ్నియా, హెర్సగోవినాలలో జరిగిన రెఫరెండమ్‌లో ఎక్కువ మంది ప్రజలు బోజ్నియా స్వతంత్రంగా విడిపోవడానికే మద్దతు నిచ్చారు. ఇది ముస్లింలకూ, క్రోట్స్‌కూ, సెర్బులకూ మధ్య వైషమ్యాలకూ, కలహాలకూ, హింసాకాండకూ దారితీసింది.

అరవ రిపబ్లిక్ అయిన మెసిడోనియా కూడా, క్రోషియా, స్లొవేనియా, బోజ్నియాలతో పాటు విడిపోవాలని ప్రకటించింది. ఇప్పుడది 'యూరోపియన్ కమ్యూనిటీ' గుర్తింపుకోసం ఎదురు చూస్తున్నది.

ఇప్పటి రెండు రాష్ట్రాల ఫెడరల్ రిపబ్లిక్, 20వ శతాబ్దంలో ఏర్పడిన మూడవ రిపబ్లిక్ అవుతుంది. మొదటి ప్రపంచయుద్ధసమయం(1914-18)లో 1917 వ సం॥లో ఏర్పడిన 'కార్ఫు' ఒప్పందం ప్రకారం—యుద్ధానంతరం సెర్బులూ, క్రోట్లూ, స్లొవెన్లూ కలిసి ఒకే దేశంగా ఏర్పడాలి. ఈ ఒప్పందం

1918వ సం॥ డిసెంబర్ 1వ తేది అమలులోకి వచ్చింది. 1929వ సం॥లో యుగొస్లావియా నామకరణం జరిగింది. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యాక 1941వ సం॥లో హిట్లర్ నాయకత్వంలో జర్మనీ, యుగోస్లావియాను ఆక్రమించింది. మార్షల్ టిటో జర్మనీ సైన్యాన్ని తరుమగొట్టి కమ్యూనిస్టు ఫెడరల్ రిపబ్లిక్‌ను స్థాపించి, ప్రధానమంత్రి అయ్యాడు. ఆ తరవాత 1953వ సం॥లో ఆ దేశానికి ప్రెసిడెంట్ అయ్యాడు. 1974వ సం॥లో ఆరు రిపబ్లిక్కులుగల సోషలిస్టు ఫెడరేషన్‌గా యుగొస్లావియా నూతన రాజ్యాంగాన్ని రూపొందించుకున్నది.

అయితే, 1980వ సం॥లో టిటో మరణానంతరం దేశంలో ఆర్థికపరమైన చిక్కులూ, ప్రాంతీయ ఉద్రిక్తతలూ, జాతి కలహాలూ ఏర్పడి అస్థిరత చోటు చేసుకున్నది. దాంతో సైనిక దళాలు రంగంలోకి దిగడంతో అంతర్యుద్ధం ఆరంభమయింది!

ఈనాటి సెర్బియా—మాంటెనీగ్రో రాష్ట్రాలు కలిసిన యుగొస్లావియా వెనకటి ఫెడరేషన్ జనాభాలో 44 శాతమూ, ప్రకృతివనరులలో 55 శాతమూ కలిగి ఉన్నది. మునుముందు యుగొస్లావియాలో సుస్థిరమైన శాంతి ఏర్పడాలని యావత్ ప్రపంచం ఎదురు చూస్తున్నది!





# వరనిర్ణయం

విశ్వపతి, మీనాక్షి దంపతులకు మైథిలి ఒక్కతే సంతానం. గారాబం చేసినా, కూతుర్ని తగిన క్రమశిక్షణతో పెంచాడు, విశ్వపతి. మైథిలి కూడా స్వతహాగా చురుకైనదీ, బుద్ధిమంతురాలూ. ఆమె విశ్వపతి ఆస్తికంతటికీ ఏకైక వారసురాలు కావడం చేత, తమ కోడలుగా చేసుకోవాలని చాలా మంది ఉవ్విళ్ళూరేవారు. అయితే, తమ కోరికను బయటపెట్టి ప్రయోజనం లేదని అందరికీ తెలుసు. కారణం, విశ్వపతి ముగ్గురు మేనల్లుళ్ళు!

విశ్వపతికి ముగ్గురు అక్కలున్నారు. వాళ్ళ ముగ్గురికీ రామం, సూర్యం, చంద్రం అనే పేర్లుగల ముగ్గురు కొడుకులున్నారు. వాళ్ళ తల్లులు ముగ్గురికీ మైథిలిని తమ కోడల్ని చేసుకోవాలని ఆశగా వున్నది. విశ్వపతి మేనల్లుళ్ళు ముగ్గురిలో రామం కంటే సూర్యం, చంద్రం ఇద్దరూ ధనవంతులు. అయితే, వాళ్ళల్లో సూర్యం కంటే చంద్రం ఎక్కువ అందగాడు కావడం చేత, మీనాక్షికి కూతుర్ని చంద్రానికిచ్చి పెళ్ళిచెయ్యాలని కోరికగా వుండేది.

ఒకనాడు విశ్వపతి, కూతుర్ని చేరబిలిచి, "అమ్మా! నిన్ను తమ కోడల్ని చేసుకోవాలని, నీ ముగ్గురు మేనత్తలకూ కూడా ఉబలాటంగానే వున్నది. నిన్ను చంద్రానికిచ్చి పెళ్ళిచెయ్యాలన్న, మీ అమ్మ కోరిక నీకు తెలియందికాదు! నాకంటూ ప్రత్యేకంగా ఏ కోరికాలేదు. ముగ్గురు మేనల్లుళ్ళూ నాకు సమానమే. నువ్వు తెలివైనదానివే కాక బుద్ధిమంతురాలివన్న అహంకారం, తండ్రిగా నాకు ఎంతో ఆనందం! బాగా ఆలోచించుకుని నువ్వే వరనిర్ణయం చెయ్యి. ఆ ప్రకారమే నీ పెళ్ళి జరిపిస్తాను," అన్నాడు.

లక్ష్మీగాయత్రి



తండ్రిమాటలకు మైథిలి కాస్త సిగ్గు పడుతూ, "నిర్ణయించేందుకు, ఆ ముగ్గురి అలవాట్లూ, ప్రవర్తనా నేనీనాటి వరకూ అంతగా గమనించలేదు, నాన్నా!" అన్నది.

ఇది విని విశ్వపతి ఒకక్షణం ఆలోచించి, "మరొక పదిహేను రోజుల్లో ఉగాది పండుగ రానేవస్తున్నది. పండుగకు రమ్మని, నీ ముగ్గురు బావలనూ ఆహ్వానిస్తాను. అప్పుడు తీరికగా నీ పరీక్ష కానీ!" అన్నాడు.

తర్వాత విశ్వపతి వెళ్ళి, పండుగకు మూడు కుటుంబాలనూ ఆహ్వానించి, పెళ్ళిమాట ఎత్తిన ముగ్గురక్కలకూ, "నిర్ణయం నా కూతురుకే వదిలేశాను. ఏ సంగతీ ఉగాది వెళ్ళగానే చెబుతానన్నది. దాని ఇష్టప్రకారమే చేస్తాను," అని చెప్పాడు.

విశ్వపతి ముగ్గురు మేనల్లుళ్ళూ పండుగకు వచ్చారు. ఉగాదినాడు తెల్లవారు జామునే లేచి, తలంట్లు పోసుకుని, విశ్వపతి కొన్న కొత్త బట్టలు కట్టుకున్నారు. ఇంతలో, వీధిలోంచి మల్లెపూల మనిషి కేక వినిపించింది. అది విని మైథిలి వీధి వాకిలిదగ్గిరకువచ్చిపూలపిల్లనుపిలిచింది.

అక్కడే వున్న ముగ్గురిలో సూర్యం, "ఇంటిచుట్టూరాతోటలోఅన్నిపూలుండగా, మళ్ళీ పూలు కొనడం ఎందుకు?" అన్నాడు.

ఆ ప్రశ్నకు మైథిలి జవాబిచ్చేలోగానే రామం నవ్వి, "తోటలో అన్ని రకాల పువ్వులూ వున్నవి గాని, మల్లెలు లేవు. కొనుక్కోనీ!" అంటూ పూలపిల్ల వైపు తిరిగి, "రెండు మూరలు కొలిచి ఇవ్వు!" అంటూ జేబులోంచి డబ్బు తీశాడు.

పూలపిల్ల పూలమాల కొలిచి ఇవ్వబోయింది.

ఇంతలో చంద్రం ఆ పిల్లను వారిస్తూ, "మరి రెండు మూరలు ఇవ్వు!" అని రామం వైపు చూసి వేళాకోళంగా, "పండగపూట పువ్వులు కొనేవాడివి, బొత్తిగా బొటాబొటీగా కొనకపోతే, భారీగా

కొనవచ్చుగదా,'' అంటూ తన జేబు లోంచి డబ్బు తీసి పూలపిల్లకు ఇచ్చాడు.

రామం ఆ మాటలకు చిన్నబుచ్చుకోక, ''ఇంట్లో వున్న ఇద్దరాడవాళ్ళ తలలకూ, రెండు మూరల పువ్వులు చాలు. అవసరానికి మించి వృథా చెయ్యడం దేనికి ?'' అన్నాడు.

''తల కొలిచి పువ్వులు కొంటావన్న మాట, భేష్!'' అంటూ నవ్వాడు చంద్రం.

సూర్యం అతడి నవ్వుకు శృతికలిపాడు. రామం మౌనంగా వూరుకున్నాడు.

ముగ్గురి సంభాషణా విన్న మైథిలి చిన్నగా నవ్వుకుని, మల్లెలు తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది.

మరి కొంతసేపటికి, విశ్వపతికి వాడుకగా చీరలు అమ్ముతున్న మనిషి, చీరల మూట పట్టుకుని వచ్చాడు. వాణ్ణి చూసి ఆశ్చర్యంగా విశ్వపతి, ''పండుగకు కావలసిన చీరలు తీసుకున్నాం గదా, మళ్ళీ వచ్చావేమిటి?'' అని ప్రశ్నించాడు.

''కొత్త రకాల చీరలు వచ్చాయి. బాబూ ! అమ్మాయిగారికి బాగుంటాయని తెచ్చాను,'' అన్నాడు చీరలవాడు.

విశ్వపతి వాడికి జవాబిచ్చే లోపలే, చంద్రం, ''ఏవీ చూపించు !'' అన్నాడు.

ఈలోగా వాళ్ళ మాటలు విని, మైథిలి అక్కడికి వచ్చింది. ''ఏదో కొత్త రకపు




చీరలట, నీకేది నచ్చుతుందో చూసుకో!'' అన్నాడు చంద్రం.

''ఇప్పుడెందుకు, బావా! పండక్కి రెండు చీరలు తీసుకున్నాను,'' అన్నది మైథిలి.

''ఇది పండక్కి నేనిచ్చే కానుక అనుకో!'' అంటూ నవ్వాడు చంద్రం.

రామం జోక్యం చేసుకుని, ''చీరలు కొత్తవి వుండగా, మళ్ళీ కొని డబ్బువృథా చెయ్యడం దేనికి, చంద్రం? ఆ డబ్బుపెట్టి ఇంకేదైనా కొని ఇవ్వరాదా ?'' అన్నాడు.

''ఇంకేదైనా కొనివ్వడం తర్వాత చూస్తాను !'' అంటూ చంద్రం, వెంటనే చీర లన్నిటిలోకీ ఖరీదైన చీర ఎంపిక చేశాడు.



రచనలంటే ఇష్టమనీ, కాని ఆయన రచనల్లో ఒకటి ఎంత ప్రయత్నించినా దొరకలేదనీ, అంటూండగా విన్నాను. బజారులో ఈ పుస్తకం కంటబడగానే నీ మాటలు గుర్తొచ్చి, వెంటనే కొని తెచ్చాను. నా కానుకగా తీసుకో!'' అన్నాడు రామం.

ఆ రాత్రి భోజనాలయాక, ఎందుకో పెరట్లోకి వెళ్ళబోతూ మైథిలి, అక్కడ జరుగుతున్న సంభాషణ విని, అప్రయత్నంగా ఆగిపోయింది.

''నీ దగ్గిర లేదంటే నమ్మబుద్ధికావడం లేదు, రామం!'' కాస్త నిష్ఠూరంగా వినిపించింది, చంద్రం స్వరం.

''నిజంగా లేదు, చంద్రం! సాయంత్రం నా దగ్గిరున్న రెండువందల రూపాయలూ, ఏదో అవసరానికి కావాలని మామయ్య తీసుకున్నాడు. సూర్యాన్ని అడిగిచూడు!'' అంటున్నాడు రామం.

''సరేలే! డబ్బుకూ వాడి ప్రాణానికీ లంకె,'' అన్నాడు చంద్రం విసుగ్గా.

వాళ్ళ మాటలు విని అప్పటికి మౌనంగా ఇంట్లోకి వెళ్ళిన మైథిలి, కుతూహలం అపుకోలేక తండ్రిని రహస్యంగా, ''రామం బావ దగ్గిర డబ్బే మైనా తీసుకున్నావా?'' అని ప్రశ్నించింది.

విశ్వపతి ఆశ్చర్యంగా, ''నీకెలా తెలుసు?'' అన్నాడు.

మైథిలి ఆ చీర నచ్చినట్టు తల ఊపగానే, చంద్రం, రామం వైపు ఒకసారి గర్వంగా చూసి, లోపలికి వెళ్ళి డబ్బు తెచ్చి చీరలవాడి కిచ్చాడు.

ఆ సాయంత్రం రామం, సూర్యం, చంద్రం ముగ్గురూ కలిసి అలా ఊళ్ళోకి వెళ్ళి వచ్చారు. వస్తూనే రామం మైథిలిని సమీపించి, తన చేతిలో వున్న ఒక పద్య గ్రంథాన్ని ఆమె కిచ్చాడు.

మైథిలి ఆశ్చర్యంగా, ''ఈ పూర్వకవి అంటే, నా కిష్టమని నీకెలా తెలుసు, బావా?'' అని అడిగింది.

''ఉదయం నువ్వు పక్కింటి అమ్మాయితో మాట్లాడుతూ, ఫలాని పూర్వకవి

మైధిలి అంతకుముందు పెరట్లో తాను విన్న సంభాషణ గురించి చెప్పింది. విశ్వపతి ఏదో అర్థమైనట్టుగా తలపంకిస్తూ, "ఓహెూం, అదా సంగతి! నిజానికి నేను రామం దగ్గిర, ఒక్కరూపాయి కూడా పుచ్చుకోలేదమ్మా. సూర్యం గాని, చంద్రం గాని నన్ను రామం దగ్గిర డబ్బు తీసుకున్నావా, అని అడిగితే; అవును, అవసరం కొద్దీ రెండువందలు తీసుకున్నాను, అని చెప్పమని, రామమే నాకు చెప్పాడు. ఇందులో ఏదో గూఢరహస్యం వుండి వుంటుందని, సరే అని తల ఊపాను. ఆ తర్వాత చంద్రం నన్ను అడిగితే, రామం చెప్పమన్నట్టే చెప్పాను. ఇదన్న మాట విషయం!" అంటూ పెద్దగా నవ్వాడు.

మైధిలి, తండ్రి చెప్పిందానికి సంతోషిస్తున్నట్టు ముఖం పెట్టి, "నాన్నా, ఇప్పుడు మీరు రామం బావను నిజంగానే రెండువందలు అడగండి!" అన్నది.

విశ్వపతి ఆశ్చర్యంగా, "మనకెందుకమ్మా ..." అంటూ ఏదో అనబోయాడు.

మైధిలి, తండ్రిని వారిస్తూ, "అలా కాదు, అడుగు! ఇస్తే తీసుకో," అని అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

ఆ మర్నాడు రామం, సూర్యం, చంద్రం మేనమామ కుటుంబం దగ్గిర శెలవు తీసుకుని వెళ్ళిపోయారు.



వాళ్ళు వెళ్ళాక విశ్వపతి డబ్బు తెచ్చి, కూతురు కిస్తూ, "ఇదుగోనమ్మా! అడగ్గానే ఇచ్చాడు రామం. తిరిగి ఇవ్వడానికి తొందరపడకు మామయ్యా అని కూడా చెప్పి వెళ్ళాడు," అంటూ ఆగి, ప్రసన్నంగా వున్న కూతురు ముఖం కేసి చూస్తూ కుతూహలంగా, "చూడబోతే నీ వరనిర్ణయం ముగిసినట్టున్నదే! ఒకవేళ ఆ వరుడు రామం కాదు కదా?" అని ప్రశ్నించాడు.

మైధిలి సిగ్గుతో తల వంచుకుంటూ, రామమేనన్నట్టుగా తల వూపింది.

కొంచెం దూరంగా నిలబడి, తండ్రీ కూతుళ్ళ సంభాషణ అంతా విన్న

మీనాక్షి, వాళ్ళను సమీపించి, "తండ్రీ కూతుళ్ళ పరీక్షలో రామం నెగ్గాడన్న మాట! ఇంతకూ అతడి గొప్పా చంద్రం తక్కువా ఏమిటి, తల్లీ?" అని మైథిలిని ప్రశ్నించింది.

విశ్వపతి చిరునవ్వుతో, చెప్పమన్నట్టుగా కూతురివైపు చూశాడు.

మైథిలి, తల్లికేసి చూసి చిన్నగా నవ్వి, "వాళ్ళ గొప్పా తక్కువల గురించి ఎంతయినా చెప్పవచ్చమ్మా! అయినా, నాలుగు మాటల్లో చెబుతాను. డబ్బు సంపాదించడంలోనే కాదు, సంపాదించిన దాన్ని ఖర్చు చెయ్యడంలో కూడా మనిషి తెలివితేటలు బైటపడతాయి. చంద్రం అతికి పోయేరకం. సూర్యం అందుకు పూర్తి వ్యతిరేకంగా పరమపిసినారి! మధ్యస్థుడైన రామం, ఏ ఖర్చు ఎలా చెయ్యాలో తెలిసినవాడు. గొప్పలకుపోయి తన దగ్గిరున్న డబ్బుపెట్టి, నాకు చీర కొనేసిన చంద్రం, రామాన్ని అప్పు అడగవలసి వచ్చింది. అటువంటి వాడి కిచ్చిన డబ్బు తిరిగిరాదని తెలిసిన రామం నేర్పుగా తప్పించుకున్నాడు. అయితే, అదే డబ్బు నాన్నకివ్వడానికి వెనుకాడలేదు. అంతే కాదు. పరోక్షంగా నా మనసు తెలుసుకుని, నా కోసం పుస్తకం తెచ్చిన రామం నా భర్త అయితే, నా మనసు తెలుసుకుని ప్రవర్తిస్తాడు. నేను కోరేవి మంచివైతే తీరుస్తాడు; లేనిపక్షంలో అదుపు చేస్తాడు. ఇప్పుడు చెప్పు! చంద్రం కంటే రామం గొప్పవాడు కాదా?" అని ప్రశ్నించింది.

మీనాక్షి చప్పున ఏమీ మాట్లాడలేక పోయింది. విశ్వపతి గర్వంగా నవ్వుతూ, "ఏం చెబుతుందమ్మా! ఆవిడకు అటువంటి ఆలోచనలు వస్తేగదా, చెప్పడానికి," అన్నాడు.

మీనాక్షి వెంటనే చిరుకోపంగా, "నాకు రాకపోతేనేం, నా కూతురుకు వచ్చాయి గదా! అదెవరనుకున్నారు, మీనాక్షి కూతురు!" అంటూ తృప్తిగా వంటింట్లోకి నడిచింది.





# మాయా భవనం

## 3

[హఠాత్తుగా అంతుబట్టని బలహీనతకు లోనైన వీరగిరి యువరాణి విద్యావతిని రాజధానికి సమీపంలో వున్న సరోవర విడిది భవనానికి తరలించారు. జ్యోతిషాచార్యుడి సలహా ప్రకారం రాజదంపతులు రెండుసార్లు వెళ్ళి కుమార్తెను చూసి వచ్చారు. మూడవసారి వెళ్ళినప్పుడు అక్కడ యువరాణి కనిపించలేదు. ఆమె కనిపించకుండా పోవడానికి ముందు ...]

అర్ధరాత్రి సమయంలో ఉలిక్కిపడి లేచింది యువరాణి విద్యావతి.

''యువరాణీ, లేవండి. వెంటనే మనం రాజప్రాసాదం చేరుకోవాలి!'' అంటూ వృద్ధపరిచారిక కమల, పక్కన నిలబడి, తట్టిలెపసాగింది.

''ఈ అపరాత్రివేళా? ఎందుకూ? ఇప్పుడేమయింది?'' అని అడిగింది విద్యావతి అనుమానంగా.

''మహారాజుగారు హఠాత్తుగా అస్వస్థతకు లోనయ్యారట. తమర్ని చూడాలని కలవరిస్తున్నారట. మనల్ని తీసుకు వెళ్ళడానికి పడవ వాడు వచ్చాడు,'' అన్నది కమల ఎంతో విచారంగా.

జుట్టు చిందరవందరగా ముందుకు విరబోసుకుని వుండడంవల్ల, మసక చీకటిలో ఆమె ముఖం విద్యావతికి స్పష్టంగా కనిపించడం లేదు.



''ఈ విడిదిభవనం నుంచి కదలకూడదని జ్యోతిష్కులు చెప్పారు కదా?'' అని అడిగింది విద్యావతి.

''నిజమే! రాజుగారూ, రాణిగారూ ఈరోజు ఇక్కడికి రావాలనుకున్నారట. కాని రాజుగారు హఠాత్తుగా అనారోగ్యం పాలవడంతో, మిమ్మల్నే రాజప్రాసాదానికి రమ్మని ఆజ్ఞాపించారు. రాజదంపతుల కోరిక మేరకే మనం అక్కడికి వెళుతున్నాము. రేపే మనం ఇక్కడికి తిరిగి రాగలం!'' అన్నది కమల.

విద్యావతి పడకపై నుంచి లేచింది. ఇరువురూ భవనం నుంచి వెలుపలికి వచ్చి పడవను సమీపించారు. ఆకాశమంతా మేఘాలు నిండివుండడం వల్ల వెన్నెల మసకమసకగా వున్నది. అందువల్ల, భవనం నుంచి మామూలు మార్గంలో కాకుండా వేరొక దారిలో నడుస్తున్న విషయం యువరాణి గ్రహించలేక పోయింది. కమల ఆమెకన్నా ముందు కొంతదూరంలో గబగబా నడిచి పడవలోకి చేరి, యువరాణికి చేయి అందించింది. యువరాణి పడవలో కూర్చోగానే, పడవ తీరం నుంచి బయలుదేరింది.

యువరాణి నిద్రమత్తుతో పడవలో ఒక మూలగా కూర్చున్నది. కమల ఆమె పక్కనే కూర్చున్నది గాని, ఏమీ మాట్లాడలేదు. యువరాణి కూడా తన తండ్రి ఆరోగ్యం హఠాత్తుగా ఎందుకు చెడిందో, ఇప్పుడెలా ఉన్నదో అన్న విచారంతో వుండడం వల్ల, పడవ అవతలి తీరం చేరడానికి మామూలుకన్నా మరింత ఎక్కువ సమయం పట్టిందన్న విషయం కూడా గమనించలేదు. ఆవలి తీరంలో, మేనా బోయీలతో సిద్ధంగా ఉన్నది. యువరాణి మేనాలోకి చేరగానే, నలుగురు బోయీలు దానిని మోసుకుంటూ వేగంగా నడవసాగారు.

పరిచారిక కమల మేనా వెంట నడిచి వస్తున్నదని భావించిన యువరాణి కొంత సేపటికల్లా అలాగే నిద్రపోయింది.

మేనా హఠాత్తుగా ఒక వైపుకు వాలడంతో, యువరాణి మేల్కొన్నది. రాజప్రాసాదానికి వెళ్ళే మార్గంలో ఎలాంటి ఎత్తు పల్లాలూ లేవు. మరి మేనా ఎందుకు ఇలా వాలుగా వెళుతుందన్న అనుమానంతో యువరాణి, మేనా తెరను పక్కకు తొలగించి, వెలుపలికి తొంగి చూసింది. చుట్టూ అరణ్యం! బోయీలు మేనాను ఒక కొండ మీదికి మోసుకు వెళుతున్నారు! ఆమె మేనాకు ముందూ, వెనకా, ఇరువైపులా పరిశీలించి చూసింది. పరిచారిక కమల జాడ కనిపించలేదు. తను రాజప్రాసాదానికి వెళ్ళడం లేదని యువరాణి గ్రహించింది. మరి ఎక్కడికి తీసుకు వెళుతున్నారు? అది అరణ్యమధ్యంలో, అర్ధరాత్రి సమయం కాబట్టి, ఆమె బోయీలను ఆపి సంగతి అడగదలుచుకోలేదు. కొంత సేపటికి బోయీలు, మేనాను కిందికి దించారు.

"యువరాణీ, ఇక మీరు వెలుపలికి రండి!" అని ఒకస్త్రీ కంఠస్వరం వినిపించింది.

విద్యావతి మేనా నుంచి వెలుపలికి వచ్చి, చుట్టుపక్కల కలయజూసింది. చుట్టూ అరణ్యం; ఎదురుగుండా బ్రహ్మాండమైన భవనం! రూపురేఖలలో, వేషధారణలో అచ్చంగా తన పరిచారిక కమలలా



వున్న స్త్రీ పక్కన కనిపించింది. ఆమె, సరోవర విడిది భవనం నుంచి తన వెంట వచ్చిన స్త్రీ అని యువరాణి గ్రహించింది. ఆమె చూడడానికి కమల లాగే వున్నది గాని, కంఠస్వరంలో మాత్రం కొద్దిగా తేడా కనిపించింది.

"యువరాణీ, రండి....ఇక మీదట మీకు ఈ భవనమే నివాసస్థానం!" అన్నదా స్త్రీ.

"ఇప్పుడు మనం ఎక్కడున్నాం?" అని అడిగింది యువరాణి.

ఆ స్త్రీ మాట్లాడలేదు.

"అసలు నువ్వెవరు? ఇక్కడికి నన్నెందుకు ఇలా రహస్యంగా తీసుకు



వచ్చావు? మా తండ్రి అనారోగ్యం పాలయ్యారనీ, వెంటనే నన్ను చూడా లంటున్నారనీ చెప్పావు కదా? మరి ఇప్పుడు ఆయన ఎక్కడ? ఈ భవనాన్ని నేను ఇంతకు ముందెన్నడూ చూడలేదే! ఇది ఎవరిది? అసలు నన్నెందుకు ఇక్కడికి తీసుకువచ్చావు?'' అని అడి గింది యువరాణి.

''యువరాణీ, ఆగ్రహించకండి. మీ ప్రశ్నలన్నిటికీ ఇప్పుడు సమాధానం చెప్పలేనుగాని, ఒక్క విషయం మాత్రం చెబుతాను. ఈ బ్రహ్మాండమైన భవనం పేరు 'మాయా భవనం'. ప్రస్తుతానికి మీరు అమాత్రం తెలుసుకుంటే చాలు. మరొక్క ముఖ్య విషయం. మీకు ఈ భవనంలో ఎవరి నుంచి గాని ఎటువంటి ఆపదా రాదు. మిమ్మల్ని క్షేమంగా చూసు కునే బాధ్యత నాది. మీకు ఎటువంటి కొరతా లేకుండా చూసుకుంటాం. అంత వరకు....'' అని ఏదో చెప్పబోయి ఆగి పోయిందా స్త్రీ.

''ఎంత వరకు? ఇంతకూ నువ్వెవరో చెప్పనే లేదు!'' అని ప్రశ్నించింది యువరాణి.

''మీరు నన్ను మీ పరిచారిక పేరుతో 'కమలా' అనే పిలవవచ్చు.'' అని ఆమె కొంతసేపు ఆగి, ''మా యజమాని ఉండా లని అనుకున్నంతకాలం మీరిక్కడే వుంటారు!'' అన్నది.

''ఎవరు మీ యజమాని?''అని గద్దించి అడిగింది యువరాణి.

''ఆ విషయం మీకు క్రమంగా దానం తట అదే తెలుస్తుంది. ఇప్పుడు నామాట విని లోపలికి వెళదాం రండి. విడిది భవనంలో మీకు నిద్రాభంగమయింది కాబట్టి, మీరు వెంటనే తిరిగి నిద్రపోవడం అవసరం,'' అన్నదా స్త్రీ దృఢమైన కంఠ స్వరంతో.

ఆ తరవాత ఆమె దూరంగా నిలబడిన బోయీలకేసి తిరిగి, ''ఇక మీరు వెళ్ళ వచ్చు!'' అన్నది.



వాళ్ళు ఆమెకు వంగి నమస్కరించి, అక్కడినుంచి వెళ్ళిపోయారు.

ఆ తరవాత ఆమె విద్యావతిని తన వెంట రమ్మని చకచకా భవనం మెట్లెక్క సాగింది. విద్యావతి ఆమెను అనుసరించింది. ఆ మాయాభవనం అత్యంత సుందరంగా ఉన్నది. విశాలమైన గదుల గోడలకూ, స్తంభాలకూ అందమైన అద్దాలు అమర్చబడి ఉన్నాయి. తిరిగిన చోటల్లా విద్యావతి ప్రతిబింబాలు కనిపించాయి. ఆ స్త్రీ, విద్యావతి, భవనం ముందున్న విశాల మంటపాన్ని దాటి, భవనం చివర వున్న మెట్ల దగ్గిరకి చేరారు. అక్కడినుంచి వాళ్ళిరువురూ మెట్లెక్కి, భవనం పైభాగంలోని విశాలమైన గదిలోకి అడుగుపెట్టారు. ఆ గది మనోహరమైన మణి మాణిక్యాలతో, పుష్పాలతో అందంగా అలంకరించబడి ఉన్నది. అక్కడి ప్రతి వస్తువూ వింత కాంతులతో మెరుస్తున్నది. ఎటు చూసినా అద్దాలు అమర్చబడి ఉన్నాయి!

ఆ విశాలమైన గదిలో ఒకవైపున వున్న పట్టుపాన్పును చూపి, "యువరాణీ! మీరిక్కడ హాయిగా నిద్రపోవచ్చు. నేను వచ్చి లేపేవరకు లేవనవసరం లేదు!" అన్నది ఆ స్త్రీ అధికారం ధ్వనించే కంఠస్వరంతో.

విద్యావతి ఆమె చెప్పినదానికి కాదనడం ఇష్టంలేక, మౌనంగా పాన్పుమీదికి చేరి మేను వాల్చి, కళ్ళు మూసుకున్నది. ఆ స్త్రీ తననెందుకు ఇక్కడికి తీసుకు వచ్చింది? ఇప్పుడు తండ్రి ఆరోగ్యం ఎలా ఉన్నదో? తను కనిపించకపోతే తల్లిదండ్రులెలా తల్లడిల్లిపోతారో కదా! వృద్ధ పరిచారిక కమల సరోవర విడిది భవనంలోనే వుండిపోయిందా? భగవంతుడా, ఆమెకెలాంటి అపదా రాకుండా కాపాడు! మాయాభవనంలో తనకు మునుముందు ఎలాంటి అనుభవాలు కలుగనున్నాయో కదా! అని ఆమె రకరకాలుగా ఆలోచించ సాగింది!

* * *

సేనానాయకుడు ఉగ్రసేనుడు మహారాణి ఇంద్రజేశ్వరీదేవి సహోదరుడు. పడవ వాడు వెళ్ళి రాజు రమ్మన్నారని చెప్పగానే, ఉగ్రసేనుడు హుటాహుటిని బయలుదేరి విడిది భవనాన్ని చేరాడు. రాజు సంగతి చెప్పాడు. సేనానాయకుడు పడవ వాణ్ణి చూశాడు.

వాడు చేతులు జోడించి, ''నిన్న మధ్యాన్నం పరిచారిక లిద్దరినీ సరోవరం దాటించి అక్కడే వుండిపోయాను, ప్రభూ! ఆ తరవాత అక్కడినుంచి కదల లేదు. రాత్రి కూడా అదే పడవలోనే ఎప్పటిలా పడుకుని నిద్రపోయాను. యువరాణిగారి సంగతి నాకేమీ తెలియదు, ప్రభూ!'' అన్నాడు.

ఉగ్రసేనుడు మౌనంగా కొంతసేపు ఆలోచించి, రాజుతో, ''ప్రభూ! దీవికి దరిదాపులలో ఇది తప్ప మరొక పడవ లేదు. కాబట్టి యువరాణి పడవలో వెళ్ళి వుండే అవకాశంలేదు. సరోవరం అవతలి గట్టు చాలా దూరంలో ఉన్నది; కొన్ని చోట్ల మరీ లోతుగానూ ఉన్నది. కాబట్టి ఆమె ఈదుకుంటూ వెళ్ళడానికి సాధ్యం కాదు. పైగా ఆమెకు అలా వెళ్ళవలసిన అవసరం కూడా లేదు. కాబట్టి ఎవరో దొంగచాటుగా విడిదిభవనంలోకి ప్రవేశించి, యువరాణిని మంచి మాటలతో వంచించి గానీ, బలవంతంగా గానీ, తీసుకుని వెళ్ళి వుండాలి. అంటే విద్యా వతిని ఎవరో అపహరించుకుని వెళ్ళారు!'' అన్నాడు.

రాజు మౌనంగా తల పంకించాడు.

పరిచారిక కమలను మాత్రం విడిది భవనంలోనే వుంచి, రాజూ, రాణీ, ఉగ్రసేనుడూ పడవలోకి వచ్చి కూర్చున్నారు. పడవ ముందుకు కదిలింది. విద్యావతి ఏమై వుంటుంది? ఎక్కడికి వెళ్ళి వుంటుంది? ఆమెను ఎవరు అపహరించి వుంటారు? ఆమె ఆచూకీ తెలుసుకొని ఆమెను రక్షించడం ఎలా? అని తీవ్రంగా ఆలోచిస్తూ ముగ్గురూ రాజభవనం చేరారు. —(ఇంకా వుంది)



# ఇద్దరు దొంగలు

ఒకానొక జమీందారుగారి మామిడితోట విరగకాసింది. చెట్లన్నీ బరువైన కాయలతో కళకళ లాడుతున్నాయి. దీనితో తోటలో దొంగతనాలు ఎక్కువయ్యాయి. రోజూ వందలకొద్దీ కాయలు దొంగిలించబడుతున్నాయి. జమీందారు, తోట కావలివాణ్ణి కాపలా మరింత కట్టుదిట్టం చెయ్యమని హెచ్చరించాడు.

ఎంత జాగ్రత్తగా కాపలా కాస్తున్నా, ఒకనాడు పదేళ్ళ కుర్రవాడు కాయలుకోస్తూ, కావలివాడికి దొరికిపోయాడు.

కావలివాడు, కుర్రవాణ్ణి పరీకగా చూసి, "ఎవర్రా నువ్వు? వీరయ్య కొడుకులా వున్నావు, అవునా?" అని గద్దిస్తూ అడిగాడు.

కుర్రవాడు భయపడిపోతూ, అవునన్నట్టు తల ఊపాడు. కావలివాడు పళ్ళు కొరుకుతూ, "ఔరా, దొంగ వెధవా! ఈ చింత బరికెతో నన్ను బాదమన్నావా లేక ఆ పని మీ నాన్నకు అప్పగించమన్నావా?" అని అడిగాడు.

కుర్రవాడు వణికిపోతూ, "నువ్వొద్దు! ఆ పనేదో మా నాన్నే చేయమను," అన్నాడు.

"సరే, పద మీ నాన్న దగ్గరకు!" అంటూ కావలివాడు, కుర్రవాడి చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.

"ఉండు పిలుస్తాను!" అని, కుర్రవాడు, "నాన్నా!" అంటూ గట్టిగా కేకపెట్టాడు.

ఆ మరుక్షణం, ఒక గోతాం నిండా మామిడికాయలతో, కుర్రవాడి తండ్రి వీరయ్య, దాపులనున్న మామిడిచెట్టు పైనుంచి కిందికి దిగాడు.

—కోనే నాగవెంకట ఆంజనేయులు






# మారినరూపాలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రి సమయంలో, నీ మందిరంలో పట్టుపాన్పుపై నిశ్చింతగా నిద్రపోవలసిన నువ్వు, ఇంత భీతిగొల్పే శ్మశానంలో, నానా ఇక్కట్లకూ లోనవుతూండడం చూస్తూంటే జాలికలుగుతున్నది. ఎంతటి వివేకవంతులూ, ఒక్కొక్కసారి తమ వ్యక్తిగతమైన అతిముఖ్య విషయాల గురించి, వివేకహీనుల్లా నిర్ణయాలు తీసుకోవడం చూస్తూంటాం. ఇలాంటి వాటికి కారణాలు వెదికిపట్టడం సాధ్యపడే పని కాదనుకుంటాను! ఇందుకు ఉదాహరణగా, తనను ప్రాణప్రదంగా ప్రేమించిన ఒక యువతిపట్ల, మాళవదేశ యువరాజు

## బేతాళ కథలు



ప్రవర్తించిన తీరు ఎంత అసందర్భంగా, అవివేకంగా వున్నదో చెబుతాను. శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

మాళవదేశాన్ని పాలించే వీరసింహుడు వృద్ధుడైపోయాడు. ఆయన ఏకైకపుత్రుడు సూర్యవర్మ. సూర్యవర్మ యుక్తవయస్కుడయ్యాడు. కుమారుడికి త్వరలో వివాహం జరిపి, పట్టాభిషేకం చేస్తే తన బాధ్యత తీరిపోతుందని భావించాడు, మహారాజు. యువరాజు వివాహ విషయంలో తగిన కన్య కోసం అన్వేషణ జరపవలసిన అవసరం కూడా లేదు. కుంతల దేశపు యువరాణి చంద్రప్రభ, సూర్యవర్మా ఒకరినొకరు మనసారా ప్రేమించుకున్న వాళ్ళు. చంద్రప్రభ తండ్రి వాళ్ళ వివాహానికి ఏనాడో అంగీకరించాడు. అయితే, ఆస్థానపురోహితుడు తగిన ముహూర్తం కుదరలేదని ఏడాదిగా జాప్యంచేస్తున్నాడు.

ఇలా వుండగా, ఒకనాడు సూర్యవర్మ, తన విదూషకుణ్ణి వెంటబెట్టుకుని రథంలో విహారానికి బయలుదేరాడు. రథం ఒక అరణ్యమార్గాన ప్రయాణం చేస్తున్నది. చుట్టూ రకరకాల వృక్షాలూ, అడవి జంతువులు చేసే శబ్దాలూ, పక్షుల కిలకిలా రావాలు—సూర్యవర్మకు ఎంతో ఆహ్లాదం కలిగిస్తున్నది. మధ్య మధ్య విదూషకుడు తన ఛలోక్తులతో అతడిని నవ్విస్తున్నాడు.

ఈ విధంగా, సూర్యవర్మ సూర్యాస్తమయవేళవరకూ అరణ్యంలో తిరిగి, చీకటిపడుతూండగా సారథిని రథం వెనక్కు తిప్పి నగరానికి బయలుదేరమని ఆజ్ఞాపించాడు. సారథి బాగా చీకటి పడకముందే నగరం చేరాలని, అశ్వాలను గట్టిగా అదిలించాడు. అవి వాయువేగంతో ఎత్తుపల్లాలుగా వున్న అరణ్యమార్గాన పరిగెత్తసాగాయి.

ఇంతలో హఠాత్తుగా మార్గానికి కొద్ది దూరం నుంచి ఏనుగుల ఘీంకారం వినిపించింది. అది వింటూనే రథాశ్వాలు రెండూ బెదిరిపోయి, రథాన్ని మార్గం

నుంచి పక్కకు లాగి, చెట్ల మధ్యగా తమకు ఇష్టం వచ్చినట్టు పరిగెత్తసాగాయి. సారథి వాటిని అదుపు చెయ్యలేక పోయాడు.

సూర్యవర్మా, విదూషకుడూ, ఈ ఆకస్మికపరిణామానికి నిశ్చేష్టులయ్యారు. వాళ్ళు కొంతసేపటికి తేరుకుని, రథం నుంచి కిందికి దూకడం క్షేమమా కాదా అని ఆలోచిస్తున్నంతలో, రథచక్రం ఒకటి చెట్టుబోదెను ఢీకొన్నది. దానితో రథం పక్కనున్న పల్లంలోకి ఒరిగింది. విదూషకుడూ, సారథీ దాపులవున్న పొదల్లో పడ్డారు. సూర్యవర్మ పొదల నానుకుని వున్న ఒక సరస్సులో పడిపోయాడు.

కొంతసేపటికి, తడిసిన దుస్తులతో చలికి వణుకుతూ, సూర్యవర్మ సరస్సు నుంచి లేచి వచ్చాడు. శరీరంమీద చిన్న చిన్న గాయాలతో చిరిగిన దుస్తులతో పొదలనుంచి లేచి బయటికి రాబోతున్న సారథీ, విదూషకుడూ, సూర్యవర్మ కేసి చూస్తూ ఒకక్షణం నివ్వెరపోయారు.

అది గమనించిన సూర్యవర్మ, వాళ్లను, "ఏమిటలా నాకేసి వింతగా చూస్తూ, స్థాణువుల్లా నిలబడిపోయారు?" అని ప్రశ్నించాడు.

అయితే, వాళ్ళు జవాబిచ్చే ముందే సూర్యవర్మ నిలువెల్లా కంపించిపోయాడు. అందుక్కారణం, ఉరుము లాంటి అతడి కంఠస్వరం, కోమలంగా వీణ మీటినట్టుం





TL—F-4



తొలిజాము గడిచే సమయానికి నగరం చేరారు.

తమ కుమారుడు ఆడపిల్లగా మారి పోయాడని తెలుసుకుని, రాజదంపతులు ఎంతగానో విచారించారు. తెల్లవారేసరికి ఈ వార్త దావానలంలా మాళవరాజ్య మంతటా పాక్కిపోయింది.

"మనసూర్యవర్మ కాస్తా, సూర్యప్రభగా మారిపోయాడు!" అంటూ నగర పౌరులు తమలోతాము హాస్యమాడుకోసాగారు.

సూర్యవర్మ సిగ్గుతో, ఆ రోజంతా తన భవనం నుంచి బయటికి రాలేదు.

శరీరం స్త్రీత్వం సంతరించుకున్నా, సూర్యవర్మ మనస్సుమాత్రం అందుకు అనుగుణంగా మారలేదు. మనసేమో పూర్వపు సూర్యవర్మలా ఆలోచించేది! ఆకారం స్త్రీది, ఆలోచనాధోరణి పురుషు డిది! ఇలాంటి సంఘర్షణతో సతమతమై పోసాగాడు, సూర్యవర్మ.

ఒకనాడు రాజు వీరవర్మ, ఆస్థాన దైవజ్ఞుణ్ణి, తన కుమారుడి విషమ సమస్యకు పరిష్కారమార్గం ఏదైనా ఆలో చించవలసిందిగా కోరాడు.

అందుకు దైవజ్ఞుడు, "మహారాజా! మన రాజధానికి ఈశాన్యదిశలో గల మహారణ్యంలో, ఒక మాయాసరస్సున్నది. దాని ఉనికి బహుకొద్దిమందికి మాత్రమే

డడమే! అతడు తన శరీరాన్ని ఆపాద మస్తకం ఒకసారి పరీక్షగా చూసు కున్నాడు. చీర, రవిక, చేతులకు గాజులు, కాళ్ళకు అందెలు! చేసిన సాముగరిడీల వల్ల ఉక్కులా వుండే అతడి శరీరం, ఎంతో సుకుమారంగా మారిపోయింది.

దానితో సూర్యవర్మకు సారథీ, విదూష కుడూ తన కేసి అంత ఆశ్చర్యంగా ఎందుకు చూశారో అర్థమైంది. ఆ సరస్సులో ఏదో మహత్యం వున్నదనీ, ఆ కారణంగానే తనకు స్త్రీ రూపం వచ్చిం దనీ అతడు గ్రహించాడు.

తర్వాత ముగ్గురూ మౌనంగా, పల్లంలో ఒరిగివున్న రథాన్ని పైకి లాగి, ఆ రాత్రి

తెలుసు. ఒకానొక యక్షుడి శాపకారణంగా, అందులో అడుగుపెట్టిన పురుషుడు స్త్రీగానూ, స్త్రీ పురుషుడుగానూ మారిపోతారు. యువరాజు ప్రమాదవశాన అందులో పడడం జరిగింది. అది విధి దుష్కృతం అని సరిపెట్టుకోవలసిందే తప్ప చేయగలిగిందేమీ లేదు.'' అన్నాడు.

రాజు వీరవర్మ, దైవజ్ఞుడు చెప్పింది విని ఎంతగానో కృంగిపోయాడు. ఆయన ఈ పరిస్థితుల్లో చేయవలసిందేమిటో బాగా ఆలోచించి, ఒక వార్తాహరుడి ద్వారా కుంతలరాజుకు, ''మహారాజా! నా కుమారుడు సూర్యవర్మ ఎంతటి విధి వైపరీత్యానికి లోనుకావలసి వచ్చిందో వినే వుంటారు. ఆ కారణంగా, యువరాజు, యువరాణి చంద్రప్రభను వివాహమాడడానికి యోగ్యుడు కాదు!'' అని తెలియపరిచాడు.

అందుకు ప్రత్యుత్తరంగా యువరాణి చంద్రప్రభ, సూర్యవర్మకు ఒక లేఖ రాసి వార్తాహరుడి ద్వారా పంపింది. అందులో ఆమె, ''యువరాజా! తమకు ఆమోదయోగ్యమయితే, ఆ మాయాసరస్సులో దిగి నేను పురుషుడుగా మారతాను. అప్పుడు మనిద్దరం భార్యాభర్తలు కావడానికి ఎలాంటి ఆటంకమూ వుండదు,'' అని రాసింది.



ఆ లేఖను సూర్యవర్మ చదివి, తల్లిదండ్రులకు ఇచ్చాడు. వాళ్ళు యువరాణి చంద్రప్రభ అభిప్రాయం తెలుసుకుని, సూర్యవర్మతో, ''నాయనా! ఈ లేఖ ద్వారా, చంద్రప్రభ నిన్నెంత గాఢంగా ప్రేమించిందో అర్థమవుతున్నది. ఆమె చెప్పింది నీకు అంగీకారమే గదా?'' అని అడిగారు.

అందుకు స్త్రీ రూపంలో వున్న సూర్యవర్మ కొంతసేపు ఆలోచించి, ''చంద్రప్రభ అభిప్రాయం నాకు అంగీకారం కాదు. నేనందుకు అంగీకరించడమంటే, మరిన్ని జటిల సమస్యల వలయంలో చిక్కుకుపోవడం అవుతుంది. తనకు యోగ్యుడుగా తోచిన రాకుమారుణ్ణి వివాహమాడి, సుఖ

పడమని చంద్రప్రభకు, ఈ రోజే లేఖ రాసి పంపుతాను,'' అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సూర్యవర్మ ఇలాంటి నిర్ణయం ఎందుకు తీసుకున్నాడన్న విషయం గురించి, కార్య కారణ సంబంధాలను వెదకజూడడం వృథాశ్రమే అవుతుందిగదా? అలా కాదనుకుంటే, అతడు కించిత్తు వివేకం కూడా లేని అహంభావి అని సరిపెట్టుకోవచ్చు. పురుషుడుగా మారిన చంద్రప్రభకు, తను భార్యగా అణగిమణిగి వుండవలసి వస్తుందన్న ఆలోచన, అతడిలో మితిమీరిన అహాన్ని రేకెత్తించి వుండాలి. ఒకవేళ అతడు చంద్రప్రభను ప్రేమించిన మాట నిజమైతే, మరొకరిని వివాహమాడమని ఆమెకు లేఖ రాయలేడు గదా? ఏది ఏమైనా సూర్యవర్మ ప్రవర్తన వివేకహీనంగానూ, అసందర్భంగానూ లేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సూర్యవర్మ నిర్ణయానికి మూలకారణమేమిటో గ్రహించడం, సులువైనపని. దాని కార్యకారణ సంబంధాలు తెలుస్తూనేవున్నవి. స్త్రీ రూపంతో, పురుషుడి మనస్సుతో జీవించడం అంటే ఎంతటి చిత్రహింసకు గురికావలసి వస్తుందో, అతడికి తెలుసు. ఒకవేళ యువరాణి చంద్రప్రభ సరస్సులో దిగి పురుషుడుగా మారినా, ఆమె కూడా తనలాగే మానసిక యాతనకు గురికావలసి వస్తుంది. చంద్రప్రభను ఎంతగానో ప్రేమించిన సూర్యవర్మ, జీవితాంతం ఆమెను అలాంటి బాధకు గురిచెయ్యలేడు. ఆ కారణంగానే అతడు, ఆమె సలహాను తోసిపుచ్చాడు. అంతేతప్ప, ఆ నిర్ణయంలో అవివేకంగానీ, అసందర్భంగానీ, పురుషాహంకారంగానీ ఏమీలేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : ఆర్. పట్టాభిరామరాజు రచన]





# సహజకవి

వెంకటాపురం జమీందారుకు, ప్రతి సంవత్సరం వసంతోత్సవాలు జరిపి కవులను సన్మానించడం అలవాటు. ఒకసారి ఆయన అలాగే వసంతోత్సవం జరిపినప్పుడు, ఆయన ఆస్థానంలో వున్న కవుల పిల్లలు కూడా, తమ తండ్రులతోపాటు కవితాగోష్ఠిలో పాల్గొని పద్య పఠనం చేసి, జమీందారుతోపాటు సభికులందరినీ ఆహ్లాదపరిచారు.

అలా పద్యపఠనం చేసిన బాలకవులలో, ముగ్గురు మాత్రం అందరినీ మరింత ఆకట్టుకున్నారు.

"ఆహా, వంశపారంపర్యంగా కవిత్వం పుణికి పుచ్చుకున్న, ఈ బాలకవికుమారులను చూస్తే ముచ్చటేస్తున్నది!" అన్నాడు జమీందారు ఆనందపడిపోతూ.

అప్పుడు దివాను ఆయనతో, "అయ్యా! వీళ్ళవి కేవలం చిలకపలుకులు తప్ప మరేంకావు. కవిత్వమన్నది, ఇతర విద్యలలాగా నేర్చుకుంటే అబ్బేదికాదు. అది సహజంగా రావాలి. ఈ బాలకవులు కవితావాతావరణంలో పెరుగుతున్నవాళ్ళు. అందువల్ల, పెద్దలను అనుకరించగలరు తప్ప, తమ ఊహాపోహలతో సహజమైన కవిత్వం చెప్పలేరు. భవిష్యత్తులో వీళ్ళు కవులుగా రాణించగలరో లేరో తేల్చి చెప్పడం సాధ్యమయ్యే పనికాదు," అన్నాడు.

అందుకు జమీందారు వెంటనే, "అయితే, వీళ్ళు భవిష్యత్తులో కవులుగా రాణించగలరో లేదో తెలుసుకునేందుకు, నేను తిరుగులేని ఒక పరీక్షపెడతాను," అన్నాడు.

రెండు మాసాలు గడిచాక జమీందారు పుట్టిన రోజు వచ్చింది. ఆయన ఆనాటి సాయంత్రం మామిడితోటలో విందు

జె. ఉదయనాగశిరీష

ఏర్పాటు చేశాడు. దానికి బంధువులూ, స్నేహితులతోపాటు కవులూ, ఆనాడు అందరినీ ఆకర్షించిన ముగ్గురు బాల కవులూ కూడా వచ్చారు.

విందు ముగిసేసరికి బాగా చీకటి పడింది. నిర్మలాకాశంలో అర్ధచంద్రుడు వెలిగిపోతున్నాడు.

ఉన్నట్టుండి జమీందారు, ముగ్గురు బాలకవులను దగ్గిరకు పిలిచి, చేయెత్తి ఆకాశంలోని అందమైన అర్ధచంద్రుణ్ణి వాళ్ళకు చూపుతూ, ''ఆ అర్ధచంద్రుణ్ణి చూస్తూంటే, మీకేమనిపిస్తున్నది?'' అని ప్రశ్నించాడు.

''శివుడి జడలో మిగిలిపోయిన అర్ధ చంద్రుడు, ఆకాశంలోంచి భూమిని తొంగి చూస్తున్నాడు!'' అన్నాడు మొదటి బాలకవి.

''జమీందారుగారు ఏర్పాటు చేసిన అద్భుతమైన దీపాలకాంతికి, తన కాంతి సగమిచ్చేశాడు!'' అన్నాడు రెండవ బాలకవి.

వాళ్ళు చేసిన ఉత్ప్రేక్షలకు జమీందారు ఆనందం పట్టలేకపోయాడు. అక్కడ వున్న వాళ్ళందరూ పెద్దగా హర్షధ్వానాలు చేశారు.

జమీందారు మూడవ బాలకవితో, ''బాలకవీ! నిర్మలమైన ఆకాశంలోని ఆ అర్ధచంద్రుణ్ణి చూస్తూంటే, నీకేమనిపిస్తున్నదో కూడా చెప్పు,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

బాలకవి అర్ధచంద్రుడికేసి ఒకసారి పరీక్షగా చూసి, జమీందారుతో, ''ప్రభూ! నేను బాలకవిని గదా! అందుచేత ఈ అర్ధచంద్రుడు నా కంటికి, చప్పరించిన నిమ్మతొనలా వున్నాడు!'' అన్నాడు.

తను బాలకవిని అంటూ, అందుకు తగ్గట్టుగా అర్ధచంద్రుణ్ణి వర్ణించిన అతడి చమత్కారానికి జమీందారు చాలా సంతోషించి, ''నువ్వు మునుముందు సహజకవివై గొప్ప కీర్తి గడిస్తావు!'' అంటూ దీవించాడు.



## చందమామ
## అనుబంధం—44



మనదేశపు పక్షులు-జంతువులు :

# ఖడ్గమృగం

ఇండియా, ఇండొనేషియా, ఆఫ్రికాలోని కొన్ని ప్రాంతాలలో మాత్రం నివసించే వింత జంతువు ఖడ్గమృగం. వీటిలో ఐదు రకాలు ఉన్నాయి. ఆఫ్రికాకు చెందిన నలుపు తెలుపు ఖడ్గమృగం, జావా, సుమత్ర ఖడ్గమృగాలు, 'గ్రేట్ ఇండియన్ రినోజెరస్' అనే మన దేశానికి చెందిన ఖడ్గ మృగాలు ముఖ్యమైనవి. మనదేశంలోని ఖడ్గమృగాలే పెద్దవి. ఇవే చాలా ప్రసిద్ధమైనవి. చూడడానికి వికారంగా కనిపించే ఖడ్గమృగాల ప్రత్యేకత వాటి పొడవాటి ముక్కు మీద మొలిచిన కొమ్ము. మన దేశంలోని ఖడ్గమృగాలకు ఒకే కొమ్ము వుంటుందిగాని, ఆఫ్రికా ఖడ్గమృగాలకు రెండు కొమ్ములుంటాయి. వీటి కొమ్ములు ఎముకలుకావు. ముఖంమీది వెంట్రుకలే కట్టలుగా ఏర్పడి, గట్టిపడిపోయి కొమ్ముల్లాగా తయారవుతాయి. చెవులచుట్టూ, తోక చివరా, వెంట్రుకలుంటాయి. భుజాలవరకు వీటి ఎత్తు **180** సెం. మీ.

ఖడ్గమృగాల కొమ్ములకు ఔషధ గుణాలున్నాయని కొందరు వాటిని నిర్దాక్షిణ్యంగా వేటాడి చంపుతున్నారు. అందువల్ల వాటి సంఖ్య వేగంగా తగ్గిపోతున్నది. కాబట్టి, నశించిపోతూన్న ఈ జాతి మృగాలను రక్షించడానికి ప్రభుత్వం ప్రత్యేకంగా ఈ జంతు శరణాలయాలను ఏర్పాటు చేసింది. అస్సాంలోని కజిరంగ, జల్దపారా, గోరుమార, సొనాయ్-రుపాయ్ జంతు శరణాలయాలు ముఖ్యమైనవి. ఈ జంతువులు చారిత్రకపూర్వయుగంనుంచి వున్నాయనడానికి ఆధారాలున్నాయి!

వార్తలలో బాలలు :



# అతిపిన్న వయసు సంగీత దర్శకురాలు!

పశ్చిమ గోదావరి జిల్లాలోని ఒక పట్టణానికి చెందిన ఒక ఐదేళ్ళ పాప, బట్టలు సర్దుకుని, తల్లిదండ్రులకు చెప్పాపెట్టకుండా మద్రాసుకు బయలుదేరింది. అభిమాన గాయనీ గాయకులను చూడాలన్న తన కోరికను తల్లిదండ్రులు వినిపించుకోకపోవడంవల్ల, విసిగిపోయి ఆ పాప అంతటి పనికి తెగించింది!

అలా ఏడేళ్ళక్రితం ఊరువదిలి వచ్చిన ఆ అమ్మాయి, ఇటీవల ప్రముఖ గాయని చిత్ర పాడిన తెలుగుసినిమా పాటకు సంగీతం సమకూర్చింది! ఇప్పుడామె వయసు పన్నెండేళ్ళు! ఆమె పేరు శ్రీలేఖ.

ఐదేళ్ళ పాపగా ఇల్లు వదిలిపెట్టిన శ్రీలేఖను పోలీసులు పట్టుకుని వాళ్ళ తల్లిదండ్రులకు అప్పగించారు. తల్లిదండ్రులు పాపకున్న సంగీత అభిమానం గ్రహించి, ఏమిచేద్దామా అని ఆలోచిస్తూండగా, ఆమె బాధ్యతను వాళ్ళ బంధువు మరకతమణి తీసుకున్నాడు. ఆయన కూడా సినిమా సంగీత దర్శకుడు. మరకతమణి ఆ అమ్మాయికి శాస్త్రీయ సంగీతంలో క్రమమైన శిక్షణనిస్తూ, దానితోపాటు జానపద సంగీతాన్ని, పాశ్చాత్య సంగీత రీతులనూ నేర్పసాగాడు.

శ్రీలేఖ సంగీతాన్నే సర్వస్వంగా భావించి, బడికి వెళ్ళడం కూడా మానివేసింది. పొద్దస్తమానం సంగీత సాధనతోనే గడిపింది. ఇలా రెండేళ్ళు శ్రీలేఖ ఏకాగ్రచిత్తంతో సంగీతం నేర్చుకున్నది. సినిమాలు చూస్తూ, సినిమా సంగీతం వింటూ కాలం వెళ్ళబుచ్చేది. ఆమెకు అద్భుతమైన జ్ఞాపకశక్తి ఉన్నది. వందలాది రాగాలనూ, శ్లోకాలనూ సులభంగా జ్ఞాపకం ఉంచుకోగలుగుతున్నది. అద్భుతమైన ఆమె సంగీత జ్ఞానాన్ని పసిగట్టిన మరకతమణి, రికార్డింగులకు ఆమెను తన వెంట తీసుకుని వెళ్ళేవాడు.

ఒకనాడు రికార్డింగ్ సమయంలో ఆర్కెస్ట్రాలో పాల్గొనమని మరకతమణి, శ్రీలేఖతో చెప్పాడు. అంతకుముందే ఆమెకు హార్మోనియం వాయించడం వచ్చు. కాబట్టి, ఆమె వెంటనే సునాయాసంగా వాయించసాగింది. ఆ దృశ్యాన్ని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ఒక తమిళ కవి రాసిన పాటకు మూడే మూడు నిమిషాలలో బాణీ సమకూర్చి అందరినీ ముగ్ధుల్ని చేసింది.

శ్రీలేఖ సంగీతాన్ని విన్నవిమర్శకులు—అది, అద్భుతమైనసృష్టి అనీ, శాస్త్రీయ,జానపదపాశ్చాత్య సంగీతాల సమ్మిళితమనీ ప్రశంసిస్తున్నారు. ఇవాళ సినిమాలకు సంగీతం సమకూరుస్తున్నవాళ్ళలో అతి పిన్న వయస్కురాలు శ్రీలేఖ! ఆమె పేరు త్వరలో 'గిన్నిస్ బుక్'లో స్థానం సంపాయిస్తుంది!

తనకు సంగీతం నేర్పి, తీర్చిదిద్దిన మరకతమణి పేరు వచ్చేలాగా, శ్రీలేఖ తన పేరును 'మణిమేఖల' అని మార్చుకున్నది. 'మణిమేఖల' సంగీత సారథ్యంలో త్వరలో సినిమాలు విడుదల కానున్నాయి.

జీన్స్, చొక్కా లేదా శాల్వార్ కమీజ్ తొడుక్కుని, నుదుట విభూతి తిలకంతో చురుకుగా కనిపించే ఈ బాల సంగీత దర్శకురాలు రోజూ, పూజకు ఎక్కువకాలం వినియోగిస్తుంది!

# మీకు తెలుసా?

1. దక్షిణాగ్రంలోని కేరళలో నూతన సంవత్సరాదిని సూచించే 'విషు'ను జరుపుకుంటారు. అదే రోజున ఈశాన్య రాష్ట్రంలోనూ నూతన సంవత్సరాది పండగ చేసుకుంటారు. ఆ రాష్ట్రం ఏది? పండుగ పేరేమిటి?
2. 'మేడే' రోజునే భక్తుడైన ఒక గొప్ప క్రైస్తవ మత ప్రచారకుడి రోజు కూడా వస్తుంది. ఆయన ఎవరు?
3. బౌకేఫాలా నగరం రెండు ప్రపంచ ప్రసిద్ధమైన పేర్లను మనకు గుర్తు చేస్తుంది. అవి ఏవి?
4. నూనె రాసిన కొబ్బరికాయలను ఒక ఆటలో బంతిగా ఉపయోగిస్తారు. ఆట పేరేమిటి? ఎక్కడ ఆడతారు?
5. చంద్రగుప్త మౌర్యుడు ఎంతకాలం రాజ్యపాలన చేశాడు? అతనికన్నా ఒక సంవత్సరకాలం పాటు ఎక్కువగా పరిపాలించిన అతని కుమారుడు ఎవరు?
6. రష్యన్ లిపి ఏది?
7. ప్రప్రథమంగా కేంద్ర మంత్రిమండలిలో స్థానం వహించిన రాజవంశానికి చెందిన మహిళ ఎవరు?
8. చండీఘడ్‌లో 'రాక్ గార్డెన్'ను నిర్మించినవారెవరు?
9. జయదేవుడి గీతాలను గ్రంథ్‌సాహెబ్‌లో చేర్చిన శిక్కు గురువు ఎవరు?
10. ఇళ్ళల్లో తులసి మొక్కలను ఎందుకు పెంచుతారు?
11. కలకత్తానుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడిన రాజకీయ నాయకుడు కానటువంటి, సుప్రసిద్ధ వ్యక్తి ఎవరు?
12. కార్ల్ లూయిస్, సుదీర్ఘమైన 100 మీ॥ రికార్డును అధిగమించిన వారెవరు?
13. నెపోలియన్, ఫ్రెంచి చక్రవర్తి అయిన 1804 వ సం॥లోనే రవాణారంగంలో జరిగిన మరొక గొప్ప సంఘటన ఏది?

## సమాధానాలు

1. అస్సాం. 'బిహూ'
2. సెయింట్ జోసెఫ్, ఏసుక్రీస్తు పెంపుడు తండ్రి.
3. తన గుర్రం 'బూసిఫాలస్' అక్కడ మరణించడం వల్ల అలెగ్జాండర్ చక్రవర్తి, ఆ నగరాన్ని నిర్మించాడు.
4. యూబీ లాక్పి – మణిపూర్.
5. 24 సం॥. అశోకుడి తండ్రి బిందుసారుడు.
6. సిరిలిక్.
7. రాజకుమారి అమృత్ కౌర్. నెహ్రూ మంత్రి మండలిలో ఆరోగ్యశాఖను నిర్వహించారు.
8. నేక్ చంద్.
9. గురు అర్జున్‌సింగ్.
10. సిరిసంపదలను ఇస్తుందన్న నమ్మకం.
11. మేఘనాద్ సాహా.
12. లెరాయ్ బ్యూరెల్.
13. మొట్టమొదటి ఆవిరి యంత్రాన్ని ఆర్. ట్రెవిథిక్ విజయవంతంగా నడిపాడు.

# చందమామ కబుర్లు

## అరచేతి ప్రమాణం కంప్యూటర్లు!



ఇటీవల అరచేతి ప్రమాణంలో ప్యాకెట్ కంప్యూటర్లను రూపొందించారు. పర్సనల్ కంప్యూటర్ అనే మైక్రో కంప్యూటర్ కన్నా ఇది చిన్నది. సరిగ్గా చెప్పాలంటే ఇది 'ట్రిలియన్'లో ఒకటో వంతు వుంటుంది. దీనిని 'పికో కంప్యూటర్' అంటారు. కంప్యూటర్లు అమర్చిన చేతి గడియారాలు, పేనాలు వచ్చే రోజులు మరెంతో దూరంలో లేవు!

## అతివేగవైన రైలు!



వాయవ్య జపాన్‌లో నడుస్తున్న షికాన్‌సేన్ ఎక్స్‌ప్రెస్, గంటకు 345 కి.మీ. వేగంతో పరిగెత్తి రికార్డు సృష్టించింది. జోమో కోగెన్, ఉరావా స్టేషన్ల మధ్య సొరంగమార్గంలో ఈ ప్రయాణం జరిగింది. గత మార్చి నెలలో ఇదే రైలు గంటకు 336 కి.మీ. వేగంతో పరిగెత్తింది. అయితే, ఈ విషయంలో ప్రపంచ రికార్డును సృష్టించింది మాత్రం మే 1990 వ సం॥లో 513.3 కి. మీ. వేగంతో పరిగెత్తిన ఫ్రెంచ్ టి. జి. వి. ఎక్స్‌ప్రెస్!



## అతిపురాతనవైన శిలాజాలు!

దాదాపు 150 సంవత్సరాలకు పూర్వం స్కాట్‌లాండ్‌లో కొన్ని శిలాజాలు బయటపడ్డాయి. ఇటీవల ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన శాస్త్రవేత్తలు కొందరు ఆ శిలాజాలను పరిశోధించి అవి 370 మిలియన్ల సంవత్సరాలకు పూర్వం భూమి మీద తిరిగిన వెన్నెముక కలిగిన జంతువులదై వుండవచ్చనీ బహుశా అవి పెద్ద పాములో లేక మొసళ్ళో అయి వుండవచ్చని అభిప్రాయపడ్డారు. ఇంతవరకు అతి ప్రాచీనమైనవని భావించబడిన గ్రీన్‌లాండ్‌లో దొరికిన శిలాజాలకన్నా ఇవి పురాతనమైనవని భావిస్తున్నారు.



# ఓర్పు విలువ

దేవీపట్నంలో సోమరాజనే ధనవంతుడికి, తన ఆస్తిపాస్తుల వ్యవహాలు చూసేందుకు మనిషి అవసరం అయ్యాడు. ఈ సంగతి విన్న పొరుగూరులోని సోమరాజు స్నేహితుడు భీమరాజు, ఆ ఉద్యోగం తన మేనల్లుడు మంగపతి కివ్వవలసిందిగా కోరుతూ ఉత్తరంరాసి, మంగపతి చేతికిచ్చి అతణ్ణి సోమరాజు దగ్గరకు పంపించాడు.

మంగపతి వచ్చిన విషయం, ఇంటి లోపల వున్న సోమరాజుకు, ఆయన నౌకరు తెలియజేశాడు. సోమరాజు, నౌకరుతో, "ఆ వచ్చిన కుర్రాడితో నేనింట్లో లేననీ, రావడానికి కనీసం రెండు, మూడు గంటలైనా పడుతుందనీ చెప్పు," అన్నాడు.

నౌకరు సోమరాజు చెప్పినట్లు చేశాడు. కాని మంగపతి వచ్చింది మొదలూ క్షణ క్షణానికి ఆ నౌకరును పిలిచి, "అయ్యగారు వచ్చారా?" అని అడుగుతూం డడం, రాలేదని నౌకరు చెపుతూండడం, అలా గంటకాలం గడిచింది. మంగపతికి, ముళ్ళ మీద కూర్చున్నట్లనిపిస్తున్నది. అతడు నౌకరుతో, "నేను వచ్చి వెళ్ళానని మీ యజమానికి చెప్పు," అని అక్కడి నుంచి బయలుదేరాడు.

మంగపతికి ఇక ఆవేళకు సోమరాజును కలుసుకోవడం సాధ్యం కాదేమోనని పించింది. అతడు స్వగ్రామానికి తిరిగి పోవాలని నిశ్చయించుకుని, పడవల రేవు చేరాడు. రేవులో చాలామంది జనం గుమిగూడి కబుర్లు చెప్పుకుంటున్నారు.

మంగపతి వాళ్ళల్లో ఒకణ్ణి, "పడవ బయలుదేరడానికి ఇంకా ఎంత ఆలస్యం అవుతుంది?" అని అడిగాడు.

అందుకు వాడు చిన్నగా నవ్వి, "పడవ బయలుదేరకేం, తప్పకుండా

జొన్నలగడ్డ రత్న



వాళ్ళమే! ఆదుర్దాపడి ప్రయోజన మేమున్నది! నదిని దాటాల్సిన అవసరం మనకున్నట్లే, మనల్ని నది దాటించి పొట్ట పోసుకునే అవసరం, ఆ పడవవాడికి మాత్రం లేదా?'' అన్నారు.

మరి కొంతసేపయ్యాక మంగపతి, అక్కడి జనంతో, ''ఇంత ఆలస్యమయి పోతున్నా, మీకెవరికీ చీమకుట్టినట్లులేదు. పడవవాడి సంగతి నేను కనుక్కొని వస్తాను,'' అంటూ ఊళ్ళోకి బయలుదేరాడు.

మంగపతి ఊళ్ళో పడవవాడి ఇల్లెక్కడో అడిగి తెలుసుకుని అక్కడికి వెళ్ళాడు. పడవవాడి భార్య అతడితో, ''కడుపులో నొప్పి మెలికలు తిప్పుతున్నదని మందు కోసం వెళ్ళాడు. అయ్యవారు మందిచ్చి పంపడం ఆలస్యమైందట. రేవులో జనం ఏమనుకుంటున్నారో అని, ఇప్పుడే పరిగెత్తుకు వెళ్ళాడు,'' అన్నది.

మంగపతి ఆదరాబాదరాగా నడుచు కుంటూ రేవులోకి వచ్చేసరికి, పడవ అప్ప టికే నది మధ్యలో వున్నది. మంగపతి ఉసూరుమంటూ దానికేసి చూస్తూన్నం తలో, ఒక వ్యక్తి అక్కడికి వచ్చి, ''నీకు పడవ తప్పిపోయినట్లుంది. మరో గంట సేపు ఇక్కడే కాలక్షేపం చేశావంటే, వెళ్ళిన పడవ తిరిగి వస్తుంది. నీకు సాయంగా నేనుంటాను. పడవవాడికి

బయలుదేరుతుంది. అయితే, అదెప్పుడో చెప్పడం కష్టం. పడవ నడిపే సరంగు అయిపూ జాడాలేకుండా పోయాడు. గంట నుంచి అందరం ఇలా పడిగాపులు కాస్తున్నాం,'' అన్నాడు.

మరొక గంట గడిచినా సరంగు వచ్చే సూచనలు కనబడకపోవడంతో, మంగపతి విసుగ్గా, ''ఈ పడవవాడు ఇంతలో ఊడి పడేట్టులేడు. మనలో ఎవరిమైనా వాడెక్క డుంటాడో వెతికి తీసుకొస్తే బాగుంటుం దేమో!'' అన్నాడు.

మంగపతి ఇలా అనగానే అక్కడున్న వాళ్ళు, ''మీలాగే మేమంతా త్వరగా అవతలి ఒడ్డు చేరాలనుకుంటున్న

మనద్దర్నీ నది దాటించమని చెబుతావా,'' అన్నాడు.

మాటల సందర్భంలో ఆ వ్యక్తి సోమ రాజేనని తెలుసుకుని, మంగపతి సంతోషంగా తన మేనమామ భీమరాజిచ్చిన ఉత్తరాన్ని ఆయన కివ్వబోయాడు.

సోమరాజు ఉత్తరం తీసుకోకుండా, "మీ మేనమామ నిన్ను మా ఇంటికి పంపిస్తున్నాడని, నాకు ముందే తెలుసు. నువ్వు నన్ను కలుసుకోవాల్సింది మా ఇంటి దగ్గర కాని, ఇలా మార్గమధ్యంలో కాదు. కావాలనుకుంటే మరొకసారి ఇంటికి వచ్చి కనబడు,'' అన్నాడు.

మంగపతి ముఖం చిన్నబుచ్చుకుని చూస్తూ వుండిపోయాడు. ఇంతలో అవతలి ఒడ్డుకు వెళ్ళిన పడవ తిరిగి వచ్చింది. సోమరాజూ, మంగపతీ పడవ ఎక్కి అవతలి ఒడ్డు చేరారు.

సోమరాజు, మంగపతితో కలిసి తిన్నగా భీమరాజింటికి వెళ్ళాడు. ఆయన భీమరాజుకు మంగపతి తన ఇంటికి వచ్చింది మొదలు జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పి, "ఉద్యోగం ఇవ్వడానికి నువ్వు పంపిన మనిషికన్నా, మరొకనమ్మకస్థుడు దొరకడని, నాకు తెలుసు. ఓర్పు లేని మనిషి వెళ్ళిన ప్రతిచోటా రెండుసార్లు నిరీక్షిస్తాడని, మా తాత ఎప్పుడూ అంటూండే వాడు. నాకు బోలెడు లావాదేవీలున్నాయి. ఆ సాధకబాధకాలు చూసిపెట్టగలిగేవాడి ఓర్పరితనం ఏపాటిదో చూడడానికే, ఇలా పరీక్షించవలసి వచ్చింది '' అన్నాడు.

మంగపతి సిగ్గుపడుతూ సోమరాజుతో, "నా లోటుపాట్లను నాకు చక్కగా చూపించారు. ఓర్పు అన్నది మనిషిలో సహజంగా వుండవలసిన లక్షణం. కాని అవకాశం లభిస్తే, మీలాంటి అనుభవజ్ఞుల సాయంతో నన్ను నేను సరిదిద్దుకోగల నన్న నమ్మకం వున్నది,'' అన్నాడు.

సోమరాజు, మంగపతితో ఆప్యాయంగా, "సరే, రేపే వచ్చి ఉద్యోగంలో చేరు! నాకు ఊళ్ళో కొన్ని పనులున్నవి,'' అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.



# నష్టాల లెక్క

ఒక గ్రామంలో సుబ్బయ్య అనే పెద్ద వ్యాపారీ, నరసయ్య అనే చిన్న రైతూ మంచి స్నేహితులు. నరసయ్యకు ఒక్కడే కొడుకు, వాడి పేరు చంద్రం. వాడు చదువుపట్ల చూపిస్తున్న ఆసక్తి గమనించి, వాడి చదువు మధ్యలో ఆగిపోకుండా వుండేందుకు సుబ్బయ్య, నరసయ్యకు ఆర్థిక సాయం చేస్తుండేవాడు.

చంద్రం ఒక స్థాయివరకూ చదువు పూర్తిచేయగానే, నరసయ్య తన కొడుక్కు ఏదైనా ఉద్యోగం ఇవ్వమని సుబ్బయ్యను అడిగాడు. ఆ సమయంలో సుబ్బయ్య, పట్నంలోని తన వ్యాపారానికి సంబంధించిన లెక్కల తణిఖీకి, లెక్కల్లో సమర్థుడైన వాడికోసం వెదుకుతున్నాడు.

సుబ్బయ్య, చంద్రాన్ని పిలిచి, "నీకు చివరి పరీక్షల్లో గణితంలో ఎంత శాతంవచ్చింది?" అని అడిగాడు.

"తొంభై తొమ్మిది శాతం వచ్చిందండి," అని జవాబిచ్చాడు చంద్రం.

"అంటే—నూటికి ఒకటి తప్పు చేశావు, కాబట్టి ఒకటి నష్టం! నూటికి ఒకటి, వెయ్యికి పది, పదివేలకు వంద...ఇలా నష్టం పెరిగిపోతుంది! నా వ్యాపారం లక్షల్లో జరుగుతున్నది. వేలల్లో నష్టపోవడానికి నేను సిద్ధంగా లేను. గణితంలో అంత చురుకైనవాడివనుకుంటే, రాజధానిలో ఖజానాలో ఉద్యోగాలకోసం రాజుగారు జరిపే పరీక్షల్లో పాల్గొనడం మంచిది," అన్నాడు సుబ్బయ్య.

చంద్రం అలాగే చేసి, రాజుగారి శిస్తు వసూళ్ళశాఖలో అధికారిగా ఉద్యోగం సంపాయించాడు. ఇది తెలియగానే నరసయ్య, సుబ్బయ్యను కలుసుకుని, "చంద్రానికి ఈ ఉద్యోగం రావడంచేత, ఖజానాకు నష్టంరాదుకదా? నీ నష్టాన్ని నువ్వు తెలివిగా ఆపుకున్నావు గానీ, పాపం రాజుగారు ఆ పని చెయ్యలేక పోయారు!" అన్నాడు కసిగా.

సుబ్బయ్య ఆప్యాయంగా నరసయ్య భుజంమీద చేయివేసి, "పిచ్చివాడా! నా దగ్గిర ఉద్యోగం గొప్పదా? రాజంత వాడి కొలువులో ఉద్యోగం గొప్పదా? చంద్రం తెలివితేటలూ, చురుకుదనం చూసే, నేనానాడు వాడు భవిష్యత్తులో నష్టపోకూడదని, నా ఉత్తుత్తి నష్టం గురించి అంత నమ్మదగినట్టు మాట్లాడాను," అన్నాడు.

—యస్. లక్ష్మివిద్య





# అచ్చిరాని దివ్యశక్తులు

సీతయ్య అనేవాడికి తల్లిదండ్రులు లేరు. ఆస్తిపాస్తులు అసలే లేవు. మనిషి దృఢమైన శరీరంతో బాగా కండలుతిరిగి ఏపనైనా చేయగలనన్నట్లుంటాడు. కానీ బాగా మొహమాటస్థుడు కావడంచేత, ఆ ఊళ్ళో వాడిచేత ఊరికే పని చేయించుకునేవారే ఎక్కువ. అందువల్ల ఎంత కష్టపడి పని చేసినా, శ్రమకు తగ్గ ఫలితం మాత్రం పొందలేక ఎలాగో రోజులు వెళ్ళబుచ్చుతున్నాడు.

మిగతా విషయాలెలాగున్నా, రూపానికి నవమన్మధుడిలా వుంటాడు సీతయ్య. ఆ ఊళ్ళోనే వుంటున్న పుల్లయ్య కూతురు రమ, వాణ్ణి చూసి ప్రేమించింది. ఒక రోజున ఆ సంగతి వాడితో చెప్పి, తనను పెళ్ళి చేసుకోమన్నది.

సీతయ్య తనకు తెలిసినవారిని ఆ విషయంగా సలహా అడిగాడు. అందరూ కూడా, ''రమ అల్లరిపిల్ల. పెంకెది. మొండిఘటం. అది కని పెంచిన తల్లిదండ్రులనే నానా విధాలుగానూ వేధిస్తున్నది. అసలే నువ్వు మహా మొహమాటస్థుడివి. దాన్ని పెళ్ళి చేసుకుంటే, నీ బ్రతుకు నరకమవుతుంది,'' అని భయపెట్టారు.

దాంతో సీతయ్య ఆ ఆలోచన మానుకున్నాడు.

అయితే ఒక రోజున రమ తండ్రి పుల్లయ్య, సీతయ్య ఇంటివద్దకు వచ్చి, ''నా కూతురు నిన్ను తప్ప ఎవర్నీ పెళ్ళి చేసుకోనంటున్నది. నువ్వేమో బొత్తిగా చేతకాని వాడివి. దానికి ఎన్నో కోరికలు ఉన్నాయి. ఆ కోరికలను నువ్వు తీర్చలేవు. నేను నీకంటే మంచి సంబంధం దానికి తేగలను. కానీ, నువ్విక్కడుండగా, అది వేరే సంబంధానికి ఒప్పు

"వసుంధర"



కోదు. కాబట్టి నా మీద దయుంచి కొంత కాలంపాటు, ఈ ఊరు వదిలి వెళ్ళరా!'' అన్నాడు.

సరేనని సీతయ్య అప్పటికప్పుడే ఊరొదిలి అడవిదారి పట్టాడు. అక్కడ వాడికి సాధువొకడు కనిపించాడు. వాడాయన కాళ్ళకు మ్రొక్కి తనగోడు చెప్పుకున్నాడు. సాధువు వాడిని తన వెంట రమ్మన్నాడు.

సీతయ్య, సాధువుతో కలిసి వెళ్ళి రెండు వారాలపాటు ఆయనను సేవించుకున్నాడు. సాధువు వాడిచేత నీళ్ళు మోయించాడు. వంట చేయించాడు. వళ్ళు పట్టించుకున్నాడు.

అలా రెండు వారాలు గడిచాక, ''నేను కాశీ వెళ్ళాలి. నువ్వు మరొక సాధువును చూసుకో!'' అన్నాడు సాధువు.

సీతయ్య సరేనని వెళ్ళిపోబోతూంటే, సాధువు వాణ్ణి చూసి జాలిపడి, ''నువ్వు నిజంగానే మొహమాటస్థుడివి. ఇలా వుంటే సాటిమనుషులు నిన్ను మోసగిస్తారు. నేను నీకు కొన్ని దివ్యశక్తులిస్తాను. వాటిని నీకోసం కాక ఇతరుల సేవకుపయోగించినప్పుడే అవి అక్కరకు వస్తాయి. నువ్వు యజమానిగా భావించిన వారేం చెప్పినా నువ్వు చేయగగ్లుతావు.'' అని వాడి నెత్తిమీద చెయ్యిపెట్టి, ఏదో మంత్రోచ్చారణ చేసి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

అప్పుడు సీతయ్య తిరుగుప్రయాణమై, మార్గమధ్యంలోని ఒక ఊళ్ళో ఒక గృహస్థు ఇంటిముందాగి, తనకేదైనా పని ఇప్పించమని అడిగాడు.

ఆ గృహస్థు చిరాగ్గా, ''నువ్వేం చెయ్యగలవు? నా ఇంటి పెరట్లో నీటికొలను వుంది. అందులోని నీళ్ళన్నీ తాగివేయగలవా?'' అన్నాడు.

సీతయ్య వినయంగా తలూపి, తిన్నగా గృహస్థు ఇంటిపెరట్లోకి వెళ్ళి నీటికొలనులోని నీటినంతా ఒక్క గుక్కలో తాగేశాడు.

గృహస్థు రవంత కూడా అశ్చర్యపడకుండా కొలనులోకి తొంగిచూసి, అట్టడుగున ధగధగా మెరుస్తున్న వజ్రకంకణాన్ని గుర్తించి, ''పాపం, మా పాత పనివాడు కంకణం కొలనులో పడిపోయిందంటే నమ్మకుండా పనిలోంచి తీసేసి పంపించేశాం. అలాంటి నమ్మకస్థుడు మళ్ళీ మళ్ళీ దొరకడు. ఒక్క గుక్కలో ఇన్ని నీళ్ళు తాగగలిగినవాడికి మా దగ్గర పనెందుకు? నేను మళ్ళీ వాడినే పనిలోకి తీసుకుంటాను,'' అన్నాడు.

తన అదృష్టం బాగోలేదని సీతయ్య అక్కణ్ణించి బయల్దేరి, మరొకచోటుకు వెళ్ళి, బాగా భాగ్యవంతుడైన రమణయ్యను కలుసుకున్నాడు.

రమణయ్య పిసినారి. ఆయన సీతయ్య చేత ఇంటి పెరడంతా శుభ్రం చేయించాడు. ఇంటిలోపల బూజులన్నీ దులిపించాడు. ఎంత అసాధ్యమైన పని చెప్పినా, వాడు క్షణాల మీద చేయడం గమనించి, ఆయన ఒక ఉపాయం పన్నాడు. ఊరివారందరికీ కట్టెలు కొట్టడం, బట్టలుతకడం వగైరా పనులన్నీ ఆయన, సీతయ్యచేత చేయించి డబ్బు తను తీసుకునేవాడు. సీతయ్యకు మాత్రం చాలీ చాలని తిండి పెట్టేవాడు.

సీతయ్య తనకు జీతం కావాలనీ, తిండి ఎక్కువగా పెట్టాలనీ ఎన్నోసార్లు రమణయ్యను కోరాడు. అయితే, ప్రతిసారీ రమణయ్య చిరునవ్వునవ్వి, ''నీలో ఎన్నో



శక్తులున్నాయి. అవి వుండీ కూడా నువ్వు, నాకు సేవ చేస్తున్నావంటే, నువ్వు శాప గ్రస్తుడివి. శాపగ్రస్తుడి నెలా చూడాలో నేనలాగే చూస్తున్నాను. అదే నీకు మేలు చేస్తుంది!" అనేవాడు.

రమణయ్య ధోరణి చూసి సీతయ్య, తానక్కడ ఎంత కాలమున్నా ప్రయోజన ముండదని తిరిగి తన ఊరు వెళ్ళాడు. అక్కడవాడుజరిగిందిపుల్లయ్యకుచెప్పాడు.

పుల్లయ్య ఎంతో సంతోషించి, "దివ్య శక్తులున్న నువ్వు, వాళ్ళకూ వీళ్ళకూ సేవచెయ్యడమెందుకు? నా కూతుర్ని పెళ్ళి చేసుకుని, దాన్నే యజమానురాలిగా భావించి దాని కోరికలన్నీ తీర్చు. నువ్వు సుఖపడతావు. నేనూ ఇంకా గొప్పవాడి నవుతాను," అన్నాడు.

రమకూ, సీతయ్యకూ పెళ్ళయింది. సీతయ్య భార్యతో, "నువ్వు నా యజమాను రాలివి. నువ్వు నన్ను శాసించు. ఎంత అసాధ్యమైన పనయినా చేయగలను," అన్నాడు.

రమ సిగ్గుతో తల వంచుకుని, "నువ్వు నా భర్తవు. నువ్వే నన్ను శాసించాలి. నా మీద ప్రేమతో నువ్వు నాకేమిచ్చినా సంతోషమే! కానీ నువ్వు ఒకరి కింద సేవకుడిగా కాక స్వతంత్రంగా జీవిస్తే, నేనెంతో సంతోషిస్తాను. నా తెలివితేట లతో నీకు ఎల్లవేళలా సహకరిస్తాను," అన్నది.

భార్య తనను సేవకుడిగా కాక యజ మానిగా భావించడంతో, సీతయ్య మనసులో గర్వం పుట్టింది. వాడా రోజు నుంచీ మొహమాటాన్ని వదిలి కష్టపడి పని చేస్తూ క్రమంగా ధనవంతుడయ్యాడు. భార్య సహకారం వల్ల వాడికి జీవితం స్వర్గప్రాయంగా వున్నది.

దివ్యశక్తులతో బానిసగా జీవించడం కంటే, స్వయంశక్తిని నమ్ముకుని స్వతంత్రంగా జీవించడంలోనే ఆనంద మున్నదని అర్థమయ్యాక, సీతయ్య తను రమను వివాహం చేసుకోవడం ఆలస్యం చేశానని బాధపడేవాడు.






ఈ లోపల వానరవీరులు ప్రహస్తుణ్ణి ఎదుర్కొన్నారు. మరొకసారి వానరులూ, రాక్షసులూ అధికసంఖ్యలో పరస్పరం చంపుకున్నారు. ప్రహస్తుడి నలుగురు మంత్రులూ విజృంభించి వానరులను చంపసాగారు. అది చూసి ద్వివిదుడు అనే వానరవీరుడు పెద్ద కొండరాయి విసిరి, నరాంతకుణ్ణి చంపాడు. అలాగే దుర్ముఖుడు అనే వానరవీరుడు సమున్నతుణ్ణీ, జాంబవంతుడు మహానాదుణ్ణీ, తారుడు కుంభహనుణ్ణీ చంపారు. ప్రహస్తుడి మంత్రులు నలుగురూ చచ్చారు.

ఈ సంగతి కళ్ళారా చూసిన ప్రహస్తుడు అమితమైన క్రోధంతో వానరసేనను భయంకరంగా చెండాడసాగాడు. అప్పుడు ప్రహస్తుణ్ణి నీలుడు ఎదిరించాడు. ప్రహస్తుడు బాణాలతోనూ, నీలుడు చెట్లతోనూ యుద్ధం చేశారు. బాణాలు తన శరీరాన్ని ఎంత దారుణంగా హింసిస్తున్నా లెక్కచేయక, నీలుడు ప్రహస్తుడి రథపు గుర్రాలను చంపి, ప్రహస్తుడి ధనుస్సు పట్టుకుని విరచేశాడు. చివరకు ప్రహస్తుడూ, నీలుడూ మల్లయుద్ధానికి దిగారు. ఆ యుద్ధంలో నీలుడు ప్రహస్తుడి తలను శిలతో పగలగొట్టాడు. రాక్షసులు ఏడుస్తూ లంకకు పోయారు.

వాళ్ళు వెళ్ళి రావణుడితో ప్రహస్తుడు చచ్చినట్టు చెప్పేసరికి రావణుడికి కోపం వచ్చింది. అతను తానే స్వయంగా

## 25. కుంభకర్ణుడి మేలుకొల్పు



న్నారు. ఇంకా రావణుడి వెంట పిశాచుడూ, త్రిశురుడూ, కుంభుడూ, నికుంభుడూ మొదలైనవారున్నారు.

రాముడు రావణుడి తేజస్సు చూసి ఆశ్చర్యపోయాడు. అలాటి తేజస్సు దేవ దానవులలో ఎవరికీ ఉండదనిపించింది. అయినా, ఈ రావణుడు ఇప్పుడు తన ఎదట పడినందుకు రాముడు సంతోషించాడు; సీతను ఎత్తుకుపోయినందుకు ఇప్పుడు పగ తీర్చుకోవచ్చు! అందుకని రాముడు లక్ష్మణుడితో సహా యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా నిలబడ్డాడు.

వానరసేనను కలతపెడుతూ వచ్చే రావణుణ్ణి సుగ్రీవుడు ఎదిరించాడు. రావణుడు సుగ్రీవుణ్ణి ఒక్క బాణంతో మూర్ఛపోగొట్టాడు. రాక్షసులు సింహనాదాలు చేశారు.

అది చూసి గవాక్షుడూ, గవయుడూ, ఋషభుడూ, జ్యోతిర్ముఖుడూ, నభుడూ అనే వానరవీరులు శరీరాలు పెంచి, కొండరాళ్ళతో రావణుడి మీదికి వచ్చారు. రావణుడు అందరినీ బాణాలతో కొట్టాడు. వానరవీరులు బెదిరి, రాముణ్ణి శరణుజొచ్చారు.

రావణుడు వానరసేనను నిర్మూలిస్తూండటం చూసి, రాముడు వానర రక్షణకు బయలుదేరాడు. అది చూసి

యుద్ధానికి పోవటానికి నిశ్చయించుకున్నాడు. అతను ఉత్తమాశ్వాలు పూన్చిన తన రథం ఎక్కి బయలుదేరాడు.

అతను నగరం దాటి వచ్చేసరికి, రాళ్ళూ, చెట్లూ చేతపట్టిన వానరులసేన కనిపించింది. రావణుడు యుద్ధానికి వస్తూండటం చూసి, రాముడు విభీషణుడితో, "ఆ మహాసేనలో రకరకాల ధ్వజాలతో వచ్చేవారు ఎవరు?" అన్నాడు.

విభీషణుడు రాముడికి ఒక్కొక్కరినీ విడివిడిగా చెప్పాడు. వారిలో రావణుడి కొడుకు అకంపనుడు అనేవాడు ఒకడు ఉన్నాడు. ఇంద్రజిత్తు ఉన్నాడు; అతికాయుడూ, మహోదరుడూ అనేవాళ్ళు

లక్ష్మణుడు, రావణుణ్ణి చంపే అవకాశం తనకు ఇయ్యమని రాముణ్ణి ప్రార్థించాడు. లక్ష్మణుణ్ణి మెలకువగా ఉండమని హెచ్చరించి, రాముడు అతనికి అనుమతి ఇచ్చాడు.



లక్ష్మణుడు రావణుణ్ణి ఎదుర్కొన్నాడు. అది చూసి హనుమంతుడు ముందుగా తానే రావణుడి ముందుకు వెళ్ళి, కుడి చెయ్యి ఎత్తి, ''నువ్వు దేవ, దానవ, గంధర్వ, యక్ష, రాక్షసులను జయించావు నిజమే గాని, నీకు వానరుల మూలాన అపాయం ఉన్నది. ఈ నా చేత్తో నిన్ను చంపబోతున్నాను,'' అన్నాడు.

ఈ మాటకు రావణుడు మండిపడి, ''హనుమంతుడా, నిర్భయంగా నన్ను కొట్టు. ఒక కోతి రావణుణ్ణి కొట్టిందన్న శాశ్వతకీర్తి నీకు దక్కుతుంది. ఆ తరవాత నేను నిన్ను చంపిపారేస్తాను,'' అన్నాడు.

''జ్ఞాపకం తెచ్చుకో, నీ కొడుకు అక్షుడు నా దెబ్బకే చచ్చాడు,'' అన్నాడు హనుమంతుడు.

రావణుడు హనుమంతుణ్ణి రొమ్ము మీద తన చేత్తో చరచాడు. ఆ దెబ్బకు చలించిన హనుమంతుడు, కోపంతో రావణుడి రొమ్ము మీద బలంగా అరచేత్తో కొట్టాడు. ఆ దెబ్బకు రావణుడు, భూకంపానికి పర్వతం లాగా, ఊగిపోయాడు. అది చూసి వానరులు కోలాహలంగా హర్షధ్వానాలు చేశారు.

రావణుడు హనుమంతుడి పరాక్రమాన్ని ప్రశంసించాడు. కాని హనుమంతుడు, ''రావణా, నా పరాక్రమం కాల్చనా? నా దెబ్బతిని కూడా నువ్వింకా బతికే ఉన్నావే! ఇంకొక్కసారి నువ్వు నన్ను కొట్టు. ఆ తరవాత నేను నిన్ను పిడికిటిపోటుతో యమలోకానికి పంపేస్తాను,'' అన్నాడు.

కోపం వచ్చి రావణుడు తన పిడికిలితో హనుమంతుడి రొమ్ములో పొడిచాడు. హనుమంతుడు ఆ దెబ్బకు దిమ్మరపోయాడు. హనుమంతుడు తెప్పరిల్లి,



"రాక్షసరాజా, ఈ వానరులతో ఎందుకు యుద్ధం చేస్తున్నావు? నాతో చెయ్యి," అన్నాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా, నీకు ఆయువుమూడి నా ఎదటపడ్డావు. ఇప్పుడే నిన్ను యమపురానికి పంపుతాను," అన్నాడు రావణుడు.

"పాపాత్ముడా, ఆత్మస్తుతి చేసుకోకు. నీ శక్తీ, బలమూ, పరాక్రమమూ నాకు బాగా తెలుసు. నేను యుద్ధానికి సిద్ధంగానే ఉన్నాను," అన్నాడు లక్ష్మణుడు.

రావణుడు ఆగ్రహించి లక్ష్మణుడి పైన బాణాలు వేశాడు. లక్ష్మణుడు వాటిని దారిలోనే ఖండించాడు. ఇద్దరూ ఒకరినొకరు బాణాలతో కొట్టుకున్నారు. మధ్యలో లక్ష్మణుడు మూర్ఛపోయాడు. అది చూసి రావణుడు ముందుకు వచ్చి లక్ష్మణుణ్ణి పట్టుకుని ఎత్తబోయాడు. అంతలో హనుమంతుడు వచ్చి రావణుడి రొమ్ములో తనపిడికిలితోబలంగా కొట్టాడు. ఆ దెబ్బకు రావణుడు బోర్లపడిపోయి, నోటా, కళ్ళా, చెవులా రక్తం కక్కాడు.

అది చూసి హనుమంతుడు, మూర్ఛలో ఉన్న లక్ష్మణుణ్ణి తన చేతులలో ఎత్తుకుని, రాముడి వద్దకు తీసుకుపోయాడు.

కొద్దిసేపటికి లక్ష్మణుడికీ, రావణుడికీ కూడా స్పృహ తెలిసింది. రావణుడు మళ్ళా యుద్ధానికి సిద్ధపడ్డాడు.

తనను మళ్ళీ పొడిచేలోగా రావణుడు నీలుడి పైకి యుద్ధానికి వెళ్ళాడు.

వానర సేనానాయకుడైన నీలుడు రావణుడి బాణాల తాకిడికి బాగా నొచ్చి, రావణుడి పైన ఒక కొండశిఖరం విసిరాడు. ఈ లోపల తెప్పరిల్లిన హనుమంతుడు రావణుడి వద్దకు వచ్చి, "ఇంకొకడితో యుద్ధం చేస్తున్నావు గనక బతికిపోయావు!" అన్నాడు.

రావణుడు తన మీదికి వచ్చే కొండ శిఖరాన్ని బాణాలతో ముక్కలుముక్కలు చేసేశాడు. తరవాత అతను నీలుణ్ణి ఆగ్నేయాస్త్రంతో మూర్ఛపోగొట్టి, లక్ష్మణుడి మీదికి వెళ్ళాడు.

అప్పుడు రాముడు రావణుడి మీదికి యుద్ధానికి వచ్చాడు. అది చూసి హనుమంతుడు రాముడితో, "రావణుడితో యుద్ధం చెయ్యటానికి నువ్వు నా మీద ఎక్కి కూర్చో," అన్నాడు.



రాముడు అలాగే చేశాడు. అతను హనుమంతుడి భుజం మీద ఎక్కి, రథం మీద ఉన్న రావణుడితో యుద్ధానికి వెళ్ళాడు.

రావణుడు తీవ్రమైన బాణాలను రాముడికి వాహనమైన హనుమంతుడిపై ప్రయోగించాడు. ఆ బాణాల మూలంగా హనుమంతుడి తేజస్సు మరింత హెచ్చింది. అయితే, రాముడికి చాలా రోషం వచ్చింది. అతను రావణుడి రథచక్రాలనూ, గుర్రాలనూ, ధ్వజాన్నీ, గొడుగునూ, సారథినీ, ఆయుధాలనూ తన బాణాలతో కొట్టి రావణుడి రొమ్ములో నాటుకునేటట్టు బాణం వేశాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక రావణుడు చేతిలో ధనుస్సును జారవిడిచి, మూర్ఛపోయాడు.

రాముడు ఒక అర్ధచంద్రాకారం గల బాణంతో రావణుడి కిరీటం ఖండించి, రావణుడితో, "చాలామంది వీరులను చంపి, అలసిపోయి ఉన్నావు. ఇప్పుడు నిన్ను చంపను. నువ్వు వెళ్ళి, విశ్రాంతి తీసుకుని, మళ్ళీ యుద్ధసన్నద్ధుడవై రావటానికి అనుమతి ఇస్తున్నాను. వెళ్ళు," అన్నాడు.

ఈ మాటలు అనిపించుకున్నందుకు సిగ్గుపడుతూ రావణుడు, చేసేదిలేక, లంకలోకి వెళ్ళిపోయాడు. తరవాత రామలక్ష్మణులు యుద్ధంలో గాయపడిన వానరులకు సేవలుచేశారు.

లంకకు తిరిగి పోయిన రావణుడు రాముడి బాణాలను తలుచుకుని భయపడి, తన అనుచరులతో, "ఇంద్రుడికి తీసిపోని నేను మనిషి చేతిలో ఓడాను! నేను చేసిన గొప్ప తపస్సంతా బూడిదలో పోసిన పన్నీరే అయింది గదా! నాకు మనిషివల్ల భయం ఉంటుందని పూర్వం



రావణుడి ఆజ్ఞ పొంది రాక్షసులు గంధమూ, పూలమాలలూ, ఆహార పదార్థాలూ తీసుకుని కుంభకర్ణుడి ఇంటికి వెళ్ళారు. ఆ ఇల్లు చాలా పెద్దది. రాక్షసులు లోపలికి వెళ్ళటం చాలా కష్టమయింది. ఎందుకంటే, కుంభకర్ణుడు ఊపిరి విడిచినప్పుడల్లా ఆ గాలి రాక్షసులను వెనక్కు తోసేసింది.

అడ్డంగా పడిపోయిన పర్వతం లాగా కుంభకర్ణుడు పడుకుని గాఢమైన నిద్రలో ఉన్నాడు. అతన్ని లేపటం అసాధ్యం. అలాటి అసాధ్యమైన పనికి రాక్షసులు పూనుకుని, మొట్టమొదట అతని ముందు మాంసం రాశిగా పోశారు, మద్యపు బానలుంచారు. అతని శరీరమంతా చందనం పూశారు, అతని శరీరాన్ని పూలమాలలతో కప్పారు. తరవాత వాళ్ళు శంఖాలు ఊదారు, దొమ్మిగా అరిచారు, కుంభకర్ణుణ్ణి కొట్టారు. అటూ ఇటూ కదిలించారు, భేరీలు మోగించారు. అయినా, కుంభకర్ణుడు లేవలేదు.

రాక్షసులు గదలూ, రోకళ్ళూ, గుదియలూ తీసుకుని కుంభకర్ణుణ్ణి చచ్చేట్టు కొట్టారు. అందువల్ల కూడా ప్రయోజనం లేకపోయింది. రాక్షసులు కుంభకర్ణుడి మీదికి గుర్రాలనూ, ఒంటెలనూ, గాడిదలనూ, ఏనుగులనూ తోలారు.

బ్రహ్మ చెప్పిన మాట ఇప్పుడు నిజమయింది. మనిషివల్ల చావు రాకుండా నేను బ్రహ్మను వరం కోరలేదు. రాక్షసులారా, ఈ కారణం వల్ల మీరు మరింత శ్రద్ధగా శత్రుసంహారం చెయ్యాలి. నగరాన్ని మరింత బాగా కాపాడాలి. మీలో కొందరు పోయి కుంభకర్ణుణ్ణి నిద్ర లేపండి,'' అన్నాడు.

కుంభకర్ణుడు యుద్ధం ప్రారంభం కావటానికి తొమ్మిది రోజులు ముందుగా నిద్రపోయాడు. అతను నిద్ర లేచి, యుద్ధానికి వెళ్ళి, రామలక్ష్మణులను చంపేస్తాడని రావణుడి నమ్మకం. ఎందుకంటే కుంభకర్ణుడికి ఎవరూ శాపాలు ఇయ్యలేదు.

చిట్టచివరకు ఎలాగైతేనేం కుంభకర్ణుడు మేలుకున్నాడు. లేస్తూనే అతనికి ఆకలివేసింది. అతను తన ఎదట ఉన్న ఆహారపు రాసులను తిని, బానల కొద్దీ మద్యం తాగి, రాక్షసులను కలయజూసి, ''మీరు నన్నెందుకు లేపారు? రావణుడికి క్షేమమేగదా? ఇతర భయాలేమీ లేవు గదా?'' అని అడిగాడు.

కాని ఏదో ముంచుకురావటం చేతనే రాక్షసులు తనను నిద్రలేపారని కుంభకర్ణుడు గ్రహించాడు.

రావణుడి మంత్రీ యూపాక్షుడు కుంభకర్ణుడి ప్రశ్నకు ఇలా సమాధానం చెప్పాడు:

''కుంభకర్ణుడా, మనకు పూర్వం ఏ దేవతలవల్లా, దైత్యులవల్లా, దానవుల వల్లా కలగని భయం ఇప్పుడు మానవుల వల్ల కలుగుతున్నది. కొండలంతేసి వానరులు లంకను ముట్టడించారు. సీతను ఎత్తుకొచ్చినందుకు అలిగి, రాముడు పెద్ద భయం కలిగిస్తున్నాడు. ముందు ఒక్క వానరుడు లంక అంతా కాల్చి, అక్షకుమారుణ్ణి సేనతో సహా చంపేశాడు. ఇప్పుడు రాముడు రావణుణ్ణి యుద్ధంలో కొట్టి, చచ్చాడనుకుని వదిలిపెట్టాడు. రావణుణ్ణి దేవతలూ, దైత్య, దానవులూ చెయ్యలేకపోయిన పనిని ఈ రాముడు చేశాడు.''

తన అన్న యుద్ధంలో ఓడాడన్న మాట వినగానే కుంభకర్ణుడు కోపంగా యూపాక్షుడితో ఇలా అన్నాడు:

''నే నిప్పుడే వెళ్ళి వానరసేననూ, రామలక్ష్మణులనూ చంపేసి, తరవాత రావణుణ్ణి చూస్తాను. వానరుల రక్తమాంసాలు రాక్షసులచేత తినిపించి, రామలక్ష్మణుల రక్తాన్ని నేనే తాగుతాను.''

కోపంతో ఒళ్ళు తెలియకుండా గర్వం కొద్దీ కుంభకర్ణుడు ఆడిన ఈ మాటలు విని, మహోదరుడు చేతులు జోడించి, కుంభకర్ణుడితో, ''నువ్వు ముందు రావణుడి వద్దకు వచ్చి, ఆయన చెప్పనది విని, మంచి చెడ్డలు ఆలోచించి, తరవాత శత్రువులను జయించు,'' అన్నాడు.






# వెర్రిబాగులవాడు

ఒక గ్రామంలో ఒక విధవరాలికి ఒక్కడే కొడుకుండేవాడు. కాని వాడు వెర్రిబాగుల వాడు. వాడికి ఒంట్లు కూడా సరిగా రావు. దుకాణానికి వెళ్ళి రూపాయి మార్చితే దుకాణాదారిచ్చిన చిల్లర డబ్బులు సరిగా ఉన్నాయో లేవో కూడా వాడు కనుక్కోలేక పోయేవాడు. ఈ సంగతి బాగా గుర్తించిన దుకాణాల వాళ్ళు వాణ్ణి తరుచు మోస గిస్తూండేవారు.

తన కొడుకు వెర్రిబాగులవాడన్న కారణం చేత వాడి తల్లి వాణ్ణి కంటిని రెప్పలాగా కాపాడుతూ, మూడు పూటలా శ్రద్ధగా తిండి పెడుతూ, ఎంతో ప్రేమగా ఉండేది. కాని వాడే తన తెలివి తక్కువ తనాన్ని తలుచుకుని దిగులుపడేవాడు.

"నాకింకా కొంచెం మెదడుంటే బాగుండేదమ్మా! మెదడు లేనందువల్ల నేను నీకు కొంచెమైనా పనికిరాకుండా ఉన్నాను. మన ఇద్దరి భారమూ నువ్వే మోస్తున్నావు గద!" అనేవాడు కొడుకు.

"అందరూ తెలివిగలవాళ్ళే ఉంటారా, నాయనా? నీకు దేవుడు తెలివితేటలివ్వక పోతేనేం? మంచితనం ఇచ్చాడు, ఇద్దరికి సరిపడే కండపుష్టి ఇచ్చాడు. నువ్వు చెయ్యగల శ్రమ ఇంకెవరు చెయ్యగలరు?" అని విధవరాలు వాణ్ణి సముదాయించేది.

కాని ఈ విధమైన మాటలు వాడికి నచ్చక, "నేను తెలివిగలవాణ్ణయే దెలాగమ్మా?" అని పదేపదే తల్లిని వేధించ సాగాడు. వాడి బాధపడలేక తల్లి, "మిట్ట మీద ఉండే మంత్రాల మరిడెమ్మను అడిగి కొంచెం తెలివితేటలు తెచ్చుకో!" అని సలహా ఇచ్చింది. ఆ మాట నమ్మి మంత్రాల మరిడెమ్మ దగ్గిరికి వాడు పరిగెత్తుకు వెళ్ళాడు. మరిడెమ్మ పొయ్యి దగ్గిర కూచుని వంట చేసుకుంటున్నది.

25–ఏళ్ళనాటి చందమామ కథ



''మరిడెమ్మత్తా, నాకు కాస్త తెలివితేట లిప్పిస్తావా ? బొత్తిగా మందమతినైపోయి మా అమ్మకు సహాయం చెయ్యలేకుండా ఉన్నాను ! మతిలేనివాళ్ళకి నువ్వు తెలివి తేట లివ్వగలవని మా అమ్మ చెప్పి పంపింది,'' అన్నాడు వెర్రి బాగులవాడు, ఎంతో దీనంగా.

మంత్రాల మరిడెమ్మ వాడి కేసి ఒక సారి ఎగాదిగా చూసి, ''అన్నిటికన్న నీకు ఎక్కువ ఇష్టమైనది పట్టుకు రా. ఆ తరవాత నీకు తెలివితేటలు ఇచ్చే విషయం చూస్తాను,'' అన్నది.

వెర్రిబాగులవాడు ఇంటికి వెళ్ళి తల్లితో మరిడెమ్మ అన్నమాట చెప్పి, ''నాకన్నిటి కన్న ఎక్కువ ఇష్టమైన దేమిటమ్మా ?'' అని అడిగాడు.

''కోడిమాంసం రా, నాయనా. రేపాక కోడిని పట్టుకు వెళ్ళి, మరిడెమ్మ దగ్గిర తెలివితేటలు తెచ్చుకో,'' అన్నది తల్లి.

మర్నాడు వాడు ఒక కోడిని తీసుకుని ఉత్సాహంగా మరిడెమ్మ వద్దకు వెళ్ళి, ''నాకు అన్నిటికన్న ఇష్టమైనది తెచ్చానత్తా!'' అన్నాడు.

''ఆ మాట నిజమో, కాదో తేల్చుకోవాలి. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పు. కాళ్ళు లేకుండా పరిగెత్తేదేది ?'' అని మంత్రాల మరిడెమ్మ వెర్రిబాగులవాణ్ణి అడిగింది. చాలా సేపు బుర్ర గోక్కుని, తనకు తెలియదన్నాడు వాడు.

''అయితే నువ్వు నీకు ఎక్కువ ఇష్టమైనది తేలేదు. వెళ్ళి ఇంకోసారి రా; నీకు అన్నిటికన్న ఇష్టమైనది వెంట తీసుకు రా!'' అని మరిడెమ్మ వాణ్ణి పంపేసింది.

వాడు ఇంటికి తిరిగివచ్చే సరికల్లా వాడి తల్లి మంచాన పడి ఉన్నది. చాలా మంది చేరి చికిత్స చేయిస్తున్నారు. ఏమిటని అడిగితే ఆమె ఉన్నట్టుండి పక్షవాతంతో పడిపోయిందని చెప్పారు. చికిత్స లేమీ పని చెయ్యలేదు. ఆమె కొడుకును దగ్గిరికి పిలిచి, ''ఇక నేను

బతకను, నాయనా! మరిడెమ్మ నీకు తెలివితేట లిచ్చింది గద! ఇక నేను లేకపోయినా నీ మానాన నువ్వు జాగ్రత్తగా బతుకుతావులే! నే నిక నిశ్చింతగా ప్రాణాలు వదులుతాను." అని కన్ను మూసేసింది.




ఆ రాత్రంతా వాడు తల్లి కోసం కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ, "మా అమ్మ లేకుండా ఎట్లా బతకటం? ఇక నన్ను ఎవరు కనుక్కుంటారు? నా అవసరాలన్నీ ఎవరు తీరుస్తారు?" అనుకున్నాడు. ఈ విధంగా అనుకోవటంలో వాడికి ఒక సంగతి తెలిసి వచ్చింది: తనకు ప్రపంచం లోకెల్లా ఇష్టమైనది తల్లి తప్ప మరేదీ ముమ్మాటికీ లేదు!

అందుచేత వాడు తన తల్లి కళేబరాన్ని ఒక గోతంలో వేసుకుని మరిడెమ్మ దగ్గిరికి వెళ్ళి "అన్నిటి కన్నా ఇష్టమైనదాన్ని తెచ్చాను; నాకు తెలివితేటలియ్యి, మరిడెమ్మత్తా," అని అడిగాడు.

"ఆ మాట నిజమో కాదో తేల్చుకో వాలి. ఈ ప్రశ్నకు జవాబు చెప్పు: బంగారం కాకుండానే బంగారం కన్న కాంతిగా మెరిసేదేది?" అని మరిడెమ్మ వెర్రి బాగులవాణ్ణి అడిగింది.

వెర్రిబాగులవాడు చాలా ఆలోచించి తనకు తెలియదన్నాడు. అయితే వెళ్ళి పోయి మరొకసారి రమ్మనీ, వచ్చేటప్పుడు వాడికి ఎక్కువగా ఇష్టమైనదాన్ని తెమ్మనీ మరిడెమ్మ అన్నది.

వెర్రిబాగులవాడు తల్లిని సంచీతోబాటు భుజాన వేసుకుని ఇంటి దారి పట్టాడు. అయితే, వాడు మధ్య దారిలోనే ఒకచోట చతికిలబడి తన దుస్థితి తలుచుకుని భోరున ఏడవసాగాడు.

"ఎందు కేడుస్తున్నావు?" అని ఎవరో ప్రశ్నించటం విని వాడు తల ఎత్తి చూసే సరికి రాధ అనే పిల్ల కనిపించింది. వాడా మెతో తల్లి చచ్చిపోయి తను అసహాయ స్థితిలో ఉండటమూ, తనకు తెలివితేట లిచ్చే మంత్రాల మరిడెమ్మ అడిగిన

ప్రశ్నలకు తాను సమాధానా లివ్వలేక పోవటమూ చెప్పాడు. ఆ ప్రశ్నలు విని రాధ నవ్వి, "కాళ్ళు లేకుండా పరిగెత్తేది నది. బంగారం కన్న బాగా మెరిసేది సూర్యుడు. అది కూడా తెలీదా ? నీ వంటి వాణ్ణి ఎవరో ఒకరు ఎప్పుడూ కనిపెట్టి ఉండవలిసిందే! నేనే నిన్ను కనిపెట్టి ఉంటాను. తెలివితేటలు లేనివాళ్ళు భార్యలను బాగా చూస్తారని పెద్దలు చెబు తారు. నన్ను పెళ్ళి చేసుకుంటావా ?" అని అడిగింది.

"నీ కభ్యంతరం లేకపోతే నా కిష్టమే," అన్నాడు వెర్రిబాగులవాడు. సంతోషంగా వాళ్ళిద్దరూ పెళ్ళాడారు. రాధ వాణ్ణి తల్లి కన్న బాగా కనిపెట్టి ఉంటున్నది.

వాడు కూడా రాధ చెప్పిన పనులు ఎంత బరువైనా చేసేస్తున్నాడు. ఇద్దరికీ జంట బాగా కుదిరింది.

ఒకనాడు అకస్మాత్తుగా వెర్రిబాగుల వాడు ఒక సంగతి తెలుసుకున్నాడు, తనకు ప్రపంచంలో తన భార్యకన్న ఇష్టమైన దేదీ లేదు. అందుచేత వాడు వెంటనే రాధను వెంటబెట్టుకుని తిన్నగా మంత్రాల మరిడెమ్మ వద్దకు వెళ్ళి, "అత్తా, ఈసారి నిజంగా నా కిష్టమైన దాన్ని తెచ్చాను. ఇప్పుడైనా నాకు తెలివితేటలియ్యి." అన్నాడు.

"అలాగా ? అయితే చెప్పు; కాళ్ళు లేకుండా పుట్టి, మొదట రెండు కాళ్ళు సంపాదించి, చివరకు నాలుగు కాళ్ళు తెచ్చుకునేది ఏది ?" అని మరిడెమ్మ అడిగింది.

వెర్రిబాగులవాడు బుర్ర గోక్కోవటం చూసి రాధ వాడి చెవిలో, "కప్ప," అని రహస్యంగా చెప్పింది. "కప్ప!" అన్నాడు వెర్రిబాగులవాడు.

"ఫరవాలేదు. నీది మట్టిబుర్ర అయినా నీ భార్యది తెలివైన బుర్రే. దాన్ని మీరిద్దరూ పంచుకుని సుఖంగా ఉండండి," అని మంత్రాల మరిడెమ్మ వాళ్ళిద్దరినీ దీవించి పంపేసింది.





# కొత్త వైద్యుడు

కొత్తగా వైద్యం ప్రారంభించిన చలపతి వద్దకు, అంటురోగి ఒకడు వచ్చాడు. వాడికి మందిచ్చి పంపాక చలపతి వణకడం ప్రారంభించాడు. అది గమనించిన చలపతి భార్య సుభద్ర కారణమడిగింది.

"ఇందాక వచ్చినవాడు అంటురోగి. వాడి జబ్బు నా కంటుకున్నదని భయంగా వుంది," అన్నాడు చలపతి.

ఆ తర్వాత వాడు నోటమాట లేకుండా పడిపోయాడు. సుభద్ర భయపడి పరుగున వెళ్ళి, చలపతి మేనమామ శ్రీపతిని పిలుచుకు వచ్చింది. శ్రీపతి ఆ ఊళ్ళో పేరు మోసిన వైద్యుడు. ఆయన వద్దనే చలపతి వైద్యం నేర్చుకున్నాడు.

శ్రీపతి వచ్చి చలపతి నాడిని పరీక్షించి, "నాడి నిక్షేపంలా కొట్టుకుంటున్నది. వీడిలో అంటురోగ లక్షణాలేమీ లేవు. కానీ మనిషిలో వణుకుందంటే, వంట్లో నుంచి చలిపుడుతున్నదన్నమాట. నోట మాట రావడం లేదంటే, మెదడుకేదో అయిందన్నమాట. వీడికి శస్త్రచికిత్స చేసి మెదడును సరిచేయాలి! రెండు రోజుల పాటు వీడికి కాకరకాయకూర, కాకరకాయ పచ్చడి, కాకరకాయ పులుసుతో భోజనం పెట్టు. మంచినీళ్ళకు బదులు కాకరకాయ రసం తాగడాని కిస్తూండు," అన్నాడు.

ఇందుకు సరేనన్నది సుభద్ర. శ్రీపతి వెళ్ళిపోగానే ఆమె ఆ విధంగా వంట చేసి, భర్తను భోజనానికి పిలిచింది. సుభద్ర వండిన ఆహార పదార్థాలు చూస్తూనే చలపతి మండిపడి, "మనిషన్న వాడు తినే వంటకాలేనా ఇవి! అనారోగ్యంతో వున్నవాడికి నోటికి హితవుగా చేసి పెట్టాలన్న ధ్యాసలేదా నీకు?" అన్నాడు.

భర్త మాటలకు సుభద్ర బాధపడకుండా, "ఆహాఁ, మీకు శస్త్రచికిత్స

జొన్నలగడ్డ రామలక్ష్మి



లేకుండానే మాట వచ్చేసిందే! ఇలా జరగొచ్చని మీ మామయ్యా నాకు ముందే చెప్పాడు,'' అన్నది సంతోషంగా.

చలపతికి అసలు విషయం అర్థమయింది. తన కిష్టం లేని పదార్థాలను చూస్తే, మెదడు ప్రభావితమై శస్త్రచికిత్స అవసరం లేకుండానే సరి అవుతుందని మేనమామ భావించాడు. ఇది కూడా ఒక తరహా వైద్యమై వుండాలి!

ఇది తెలుసుకోగానే వాడు భార్యతో, ''నువ్వు వెంటనే లక్ష్మయ్య ఇంటికి వెళ్ళి, అసలు విషయం చెప్పకుండా, ఆ మాటా ఈ మాటా మాట్లాడి, లక్ష్మయ్య భార్య నుంచి ఒక విషయం రాబట్టాలి. లక్ష్మయ్య తండ్రి కేపదార్థాలంటే సుతరామూ ఇష్టం లేదో, నాకు వెంటనే తెలియాలి. ఎందుకంటే—లక్ష్మయ్య తండ్రికిలాంటి జబ్బే చేస్తే, నా వద్దకు వచ్చాడు లక్ష్మయ్య. ఈ జబ్బుకు మందు తెలియదు. మామయ్యా నడగడానికి అభిమానం అడ్డొచ్చింది. అందుకని ఈ ఉపాయం పన్నాను,'' అన్నాడు.

సుభద్ర భర్త తెలివికి మెచ్చుకుని లక్ష్మయ్య ఇంటికి బయలుదేరింది. దారిలో ఆమెకు శ్రీపతి ఎదురై మేనల్లుడి ఆరోగ్యం గురించి అడిగాడు. సుభద్ర అసలు విషయాన్నాయన వద్ద దాచిపెట్టలేకపోయింది.

అది విని శ్రీపతి నవ్వి, ''ఇలాంటి కారణమేదో వుండాలని నేననుకున్నాను. నిజం రాబట్టాలనే కాకరకాయ వైద్యం చెప్పాను. లక్ష్మయ్య తండ్రి కిలాంటి వైద్యం చేస్తే ఎలా? అది నిజమైన జబ్బు. దానికి వైద్యం వేరే వుంది. పద, ఇంటికి వెళదాం!'' అంటూ ఆమెను తీసుకుని ఇంటికి వెళ్ళి, మేనల్లుణ్ణి బాగా మందలించి, ''లక్ష్మయ్య ముందుగా, నా వద్దకే వచ్చాడు. నేను చాలా ఎక్కువ డబ్బడిగాను. ఎందుకంటే—అప్పుడు వాడు నీ దగ్గరకు వస్తాడని! అలాంటి వాడికి వైద్యం చేస్తే నీకూ పేరొస్తుందని! నీ కోసం నేనింత శ్రమ పడుతూంటే, నువ్వు నా దగ్గిర అభిమానపడతావా?'' అన్నాడు.

చలపతి తన తప్పొప్పుకుని, శ్రీపతి వద్ద ఆ జబ్బుకు వైద్యమెలా చేయాలో తెలుసుకున్నాడు. మేనమామ వెళ్ళి పోగానే చలపతి మళ్ళీ వణకసాగాడు.

''మళ్ళీ ఇప్పుడెవరికేం వైద్యం చేయాలండీ ?'' అన్నది సుభద్ర.

''నాకింకా వణుకుజబ్బు తగ్గలేదు. కొంత కాలంపాటు మంచం మీదనే వుండాలి. నేను లక్ష్మయ్య తండ్రికి మందు పంపిస్తాను. కానీ మిగతా రోగులెవర్నీ చూడను.'' అన్నాడు చలపతి.

అప్పుడు సుభద్ర, ''హలివేరు గంధం తీసి, తులసాకుల రసంతో కలిపి ఇస్తాను. అది ఉదయం లేవగానే, రాత్రి పడుకోబోయే ముందూ తీసుకోండి. అప్పుడు మీరు అంటురోగులకు వైద్యం చేసినా ఏ ప్రమాదమూ వుండదు. అనవసరంగా భయపడి వృత్తిలో చెడ్డపేరు తెచ్చుకోకండి," అన్నది.

చలపతి ఆశ్చర్యంగా, ''నేను అంటురోగికి భయపడుతున్నానని, నీకెలా తెలుసు ?'' అని అడిగాడు.

''వైద్యం ప్రారంభించిన కొత్తలో అలానే వుంటుందిట. మీ మేనమామగారు చెప్పారు,'' అన్నది సుభద్ర.

''ఓహో ! తనలా చేసి వుంటాడు. అందుకని అంతా తనకులాగే వుంటారనుకుంటున్నాడు, మామయ్య.'' అన్నాడు చలపతి ఉక్రోషంగా.

''అవునుట ! ఆయన అదీ చెప్పారు. మీకు కనుముక్కు తీరేకాదు, బుద్ధుల్లోనూ మేనమామ పోలికేనట!'' అన్నది సుభద్ర.

చలపతి గతుక్కుమన్నాడు. తల్లి పుట్టిల్లు గురించి మేనమామకు చెప్పినట్లు, తను చేస్తున్నదేమిటి ? పరోక్షంగా మేనమామ నుంచి వైద్యరహస్యాలు తెలుసుకుని, తను ఆయనను మించిన వైద్యుడనిపించుకోవాలనుకోవడం, బుద్ధిగలవాడు చేసే పనేనా ?

వాడు మర్నాటి నుంచీ తనకు తీరుబడి వున్నప్పుడల్లా మేనమామకు శుశ్రూష చేసి, త్వరలోనే వైద్యుడుగా మంచి పేరు తెచ్చుకున్నాడు.





# కాపాలిని

కాశ్మీరదేశంలో ఒకప్పుడు ఒక సుక్షత్రియుడికి ఒకే ఒక కుమార్తె ఉండేది. ఆమె పేరు సీమంతిని. ఆమె అందగత్తె. తండ్రి చనిపోయాక ఆయన ఆస్తి అయిన వనాలూ, కోటా సీమంతినివి అయ్యాయి. అందుచేత ఆ ప్రాంతంలో గల కులీనులైన యువకులు అనేకమంది ఆమెను వివాహం చేసుకోవటానికి ప్రయత్నించారు. వారిలో గణదేవుడనేవాడు ఆమెను నిజంగా ప్రేమించాడు. కాని సీమంతినికి వివాహం చేసుకునే ఆలోచన లేకపోయింది. ఆమె అందరినీ నిరాకరించింది.

సీమంతినిని కొండలూ, అరణ్యాలూ, అందులో ఉండే వింత జంతువులూ, పక్షులూ ఆకర్షించేవి. ఆమె తరచుగా కాలినడకనో, గుర్రం మీదనో అరణ్యం కుండా వెళ్ళి, కొంతదూరాన ఉన్న గరుడశిఖరం మీద కూర్చుని, ఆ ఎత్తు నుంచి కనిపించే దృశ్యాలన్నిటినీ చూసి ఆనందిస్తూ గంటలకు గంటలు గడిపేది.

ఈ విధంగా ప్రకృతిలో లీనమైన సీమంతినికి కాపాలికశక్తులు సాధించాలన్న కోరిక క్రమంగా కలిగింది. బేతాళుణ్ణి వశం చేసుకుని, పరకాయ ప్రవేశమూ, కామరూపమూ, కామగమనమూ, ఇతరసిద్ధులూ సాధించదలచి ఆమె విచిత్రమైనపూజలూ, వింత ఆహారమూ, ఉపాసనలూ ప్రారంభించింది. ఒక్కొక్కసారి ఆమె చంద్రుడికేసి నిశ్చలంగా చూసి, స్పృహ తప్పిపోయేది; ఏవేవో మూలికలతో కషాయాలు చేసుకుని తాగేది; తన శరీరాన్ని క్రూరమైన శిక్షలకు గురి చేసుకునేది. ఈవిధంగా ఆమెకు కొన్ని శక్తులు వశమయ్యాయి.

ఈ వార్తలు విని గణదేవుడు చాలా బాధపడ్డాడు. "సీమంతిని మామూలు మనిషి కాకుండా పోతున్నది. మామూలు మనిషిగా

కాశ్మీర జానపద కథ

ఉన్నప్పుడే నన్ను పెళ్ళాడ నిరాకరించింది; ఈ స్థితిలో ఇంకేం పెళ్ళాడుతుంది?'' అనుకున్నాడతను.

కాని ఆమెను మామూలు మనిషిగా చెయ్యాలన్న ఆలోచన అతన్ని పట్టుకుని వదలలేదు. సీమంతిని ఏమేమి పూజలు చేస్తున్నదీ, అతను గమనిస్తూనే ఉన్నాడు.

నెలలు గడుస్తున్న కొద్దీ సీమంతినిని రక్షించాలన్న కోరిక గణదేవుడిలో జాస్తి కాసాగింది. చివరకు అతను, పింగళ అనే ఒక మంత్రగత్తె సహకారాన్ని కోరాడు.

పింగళ గొప్ప మంత్ర శక్తులు గలదని చెప్పుకునేవారు. కాని ఆమె తన తోటలో రకరకాల మూలికలు పెంచి, మందులు తయారు చేసేది. ఆమె గణదేవుడు చెప్పిన దంతా విని, ''సీమంతిని కాపాలిని కాదలిస్తే మనమెందుకు అడ్డుపడాలి?'' అని అడిగింది.

''నాకు ఇష్టంలేదు గనక! తెలిసిందా? నువ్వు కోరిన డబ్బు ఇస్తాను. ఆమెను మామూలు మనిషిని చెయ్యగలవా? అంత అందమూ, తెలివితేటలూ గల సీమంతిని కాపాలినిగా జీవించి, కాపాలిని చావు చావడం ఘోరం!'' అన్నాడు గణదేవుడు.

''ఏం? కాపాలినిగా జీవించటంలో ఆనందం ఉండదనుకున్నావా?'' అని పింగళ అడిగింది.



''ఆనందం ఉండవచ్చు. కాని సుఖం ఉన్నదా?'' అని గణదేవుడు అడిగాడు.

''ఉండదు. నీ భార్యగానే ఆమె ఎక్కువ సుఖపడుతుంది,'' అన్నది పింగళ.

''అందుకనే ఆమె నా భార్య అయేటట్టు చెయ్యి,'' అన్నాడు గణదేవుడు.

''సహాయం చేస్తాను. నేను చెప్పినట్టు చెయ్యి. వచ్చే అమావాస్యనాడు వేటకుక్కలను వెంట బెట్టుకుని అరణ్యంలోకి వేటకు వెళ్ళు. నువ్వు ఏ మృగాన్నీ వేటాడనవసరం లేదు. తెల్లని జింక కనబడేదాకా అరణ్యమంతా గాలించు. అది కనబడ్డాక దాన్ని తరిమి పట్టుకో. దాన్ని గాయపరచకుండా పట్టుకుని, దాని మెడకు ఉచ్చువేసి తెచ్చి,

రాత్రి అంతా దాన్ని నీ భవనంలోనే ఒక గదిలో ఉంచు. మిగిలినది నేను చూస్తాను.'' అన్నది పింగళ.

ఆమె అతన్ని తోట బయటికి సాగనంపి, తిరిగి తన ఇంటి కేసి పోయేటప్పుడు ఆమె ఎడమకాలితో కొంచెం కుంటుతున్నట్టు గణదేవుడు గమనించాడు.

పింగళ చెప్పినట్టే అతను అమావాస్య నాడు తన వేటకుక్కలతో సహా అరణ్యంలోకి వెళ్ళాడు. అతను అరణ్యమంతా గాలిస్తూండగా తెల్లని జింక కనబడనే కనబడింది. వెంటనే తన వేటకుక్కలను దాని పైకి వదిలాడు. జింక శరవేగంతో పరిగెత్త సాగింది.

కొంతసేపటికి ఒక్క కుక్క తప్ప మిగిలిన వేటకుక్కలన్నీ వెనక పడి పోయాయి. జింకకు చాలా దగ్గిరగా పరిగెత్తుతున్న కుక్క తనది కాదని గణదేవుడికి తోచింది. అది అంత పరుగులోనూ వెనకకాళ్ళలో ఎడమ కాలి మీద కుంటుతున్నట్టు కనిపించింది.

త్వరలోనే ఆ కుక్క జింక వెనక కాలిని నోటితో పట్టి ఆపింది. గణదేవుడు గుర్రం మీద వచ్చి, ఆ జింక మెడలో ఉచ్చు వేశాడు. తరవాత జింక పెనగులాడక అతని వెంట అతని ఇంటికి వచ్చేసింది. ఆ జింకను పట్టిన వేటకుక్క ఏమయినదీ గణదేవుడు గమనించలేదు.

అతను జింకను ఒక గదిలో పెట్టి తాళం వేసి, తన పడక గదికి వెళ్ళి, నిద్ర పోయాడు. తెల్లవారు ఝామున అతనికి నిద్రాభంగం అయేసరికి ప్రపంచమంతా తల్లకిందులైపోతున్నట్టు తోచింది. బయట పెద్ద తుఫాను చెలరేగుతున్నదో, లేక భూకంపం వచ్చిందో అని అతను అనుకున్నాడు. కాని అదేమీలేదు. అప్పటిదాకా సీమంతినికి వశమైన పిశాచాలన్నీ, తమ శక్తులతోసహా ఆమెనువిడిచివెళ్ళిపోయాయి!

గణదేవుడు జింక ఉండే గదిలోకి వెళ్ళాడు. అక్కడ సీమంతిని ఉన్నది. ఆమె అతని భార్య కావటానికి అంగీకరించింది. వారిద్దరూ పెళ్ళాడి, సుఖంగా జీవించారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూన్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: - చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: పోదాం, పద ముందుకు! రెండవ ఫోటో: ఆత్మవిశ్వాసముంటే భయమెందుకు?

పంపినవారు: కొగ్గరపు రాధాకృష్ణమూర్తి, టీచర్, జూనియర్ కాలేజి, పామూరు-పోస్ట్, ప్రకాశం జిల్లా (ఆం. ప్ర)—523 108.

బహుమతి మొత్తం రు. 50/- నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.



The stories, articles and designs contained herein are exclusive property of the Publishers and copying or adapting them in any manner will be dealt with according to law.

## మీరు కంప్యూటర్ ప్రవీణులు అవ్వాలనుకున్నప్పుడు ప్రతిదీ ఖచ్చితంగా ఉండితీరాల్సిందే.

కంప్యూటర్ ప్రముఖుడు అవ్వాలని అతని తపన, ధ్యేయం.

మరందుకే అతను అత్యుత్తమమైన జామెట్రీ సెట్నే ఎంచుకుంటాండు. కోర్స్ సక్సెస్: ప్రొట్రాక్టర్, డివైడర్, అతను కొలుస్తాడు, రేఖా చిత్రాలు గీస్తాడు, తన ఊహతో డిజైన్లను రూపొందిస్తాడు.

చేసే ప్రతి దాంట్లోనూ సాఫల్యం సాధించాలనే ఆకాంక్ష. కంపాస్, స్కేల్— ఏళ్ళతరబడి నిరాటంకంగా, నిశితంగా పనిచేయడం కోసం అవన్నీ ఖచ్చితంగా వుండేలా ప్రావీణ్యతతో రూపొందించబడినవి. చాలాకాలం మన్నేలాగ ఎరుపు తెలుపు రంగులు గల మెటల్ బాక్స్‌లో పొందుపరచబడి వున్నాయి.

అందరికన్నా మిన్నగా మిమ్మల్ని మీరు తీర్చిదిద్దుకోవాలంటే అన్నిటికన్న మేలైనదే కావాలి మీకు. దాంతో సాఫల్యం మీది!

కోర్స్ (ఇండియా) లిమిటెడ్, బొంబాయి 400 018.




కోర్స్ సక్సెస్ జామెట్రీ సెట్
మీరు పైకి రావడానికిది పరికరం

AKA/469/TL

# యు టి ఐ, ప్రపంచంలో కెల్లా అతి పెద్ద కుటుంబం, ఇప్పుడు, 1.5 కోట్ల యూనిట్ స్వంతదార్ల కుటుంబమైంది.

ఇంకా ఇంకా పెరుగుతోంది ........



15, జూన్ 1992 వరకు
పథకం అమలులో ఉంటుంది.




## MONTHLY INCOME UNIT SCHEME

పెట్టుబడిదార్లకు సౌకర్యవంతమైన విశేషాంశాలు

ఎమ్ఐయుఎస్-92(II) : 5ఏళ్ల పథకం

క్యుములేటివ్ గ్రోత్ పరుపాయంలో, తిరుగు కొనుగోలు ద్వారా లభించిన కాపిటల్ గెయిన్స్, సెక్షన్ 48 క్రింద లాంగ్ టర్మ్ కాపిటల్ గెయిన్స్‌గా పరిగణించబడతాయి.

వ్యక్తులు ధార్మిక నిధులు/మతపరమైన నిధులు, ఇంకా ఇతర నిర్దిష్ట సంస్థలకు చెల్లించబడే మొత్తంపైన పన్ను కోత ఉండదు.

3 ఏళ్ల తర్వాత తిరుగు కొనుగోలు.

నెలలో 15 వ తేదీలోగా చేసేవారికి పూర్తి నెల డివిడెండు, ఆట తర్వాత చేసేవారికి అర్ధ నెల డివిడెండు.

ఖాతాదార్లకు అదనపు సేవాసౌకర్యం: మీ దరఖాస్తు ఫారాలు (ఈ క్రింద పేర్కొబడిన) నిర్దిష్ట బ్యాంకులలో దేనిలోనైనా ఇచ్చి, ఆ బ్యాంకు నుంచి మీ డివిడెండ్ వారంట్లను అందుకోవచ్చు.

| నెలసరి రాబడి | |
|---|---|
| మొదటి, 2వ,3వ సం. లలో సం. కి | 14½% |
| 4వ,5 వ సం. లలో సం.కి | 15% |
| అందుకు తోడుగా కనీస మూలధన వృద్ధి | 2% |

లేదా, క్యుములేటివ్ గ్రోత్

రు.1000 [redacted] రు.2100

ఇంకా ఎక్కువ, కేవలం ఐదేళ్లలో



## యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా

*వాగ్దానానికి మించిన ఫలితాలకు ఋజువు.*

UTI/7/91/TEL

# GET OFF TO A FLYING START *with*



LION
## PREMIER® HB PENCILS

Supersmooth for effortless writing. Micronized lead for unbreakable points. Grace the desks of executives and others with style.

LPP LTD • PREMIER • 261 • HB •

LION
## *PINKY*® PENCILS

Perfect classmates. Pretty & Practical. Colourful designs, strongly bonded lead for unbreakable points, give it an edge over the competition.








LION *Gee-flo*® BALLPENS
035 carbine 050 carborite

**Tungsten carbide tips.**
Made with Swiss technology.
Unbeatable points. Sharp. Smooth. Non-smudging. Race across the page. Choice of red, black and blue refills. Mini-marvels at a marvellous price.






**LION PENCILS LTD.**
95, Parijat Marine Drive, Bombay 400 002.




**OFFICIAL LICENSEE OF THE WORLD CUP**

National-766

CASIO

# వెయ్యండి తై అంటూ తాళం! చెయ్యండి ఝుమ్ అంటూ నృత్యం!



© 1991 CASIO

నృత్యం చెయ్యడం (జామింగ్) కేసియో కీబోర్డ్‌తో ఎంతో తేలిక. ఎందుకంటే, సరిగ్గా స్టార్స్‌లాగ వాయిద్యాలను వాయించడానికి అవసరమైన లక్షణాలన్నీ వున్నాయి దీట్లో. 'గ్రూవ్' చెయ్యండి డిస్కోని. పేడిని నొక్కండి. మీకు మనసైన బాణీలలోని పాటల్ని పాడండిక. చెయ్యండి 'తై' అంటూ తాళం. ఏ వీధి 'రాక్' తో అదిరిపోయేలాగ, కేసియోతో మీరు స్టైయిల్‌లో డాన్స్ చేస్తున్నారన్నమాట.

SOUND KIDS










**CITY MUSIC CO., PTE LTD.**
Singapore Tel 3377058, 3377545

**ONFLO MUSIC CO., LTD.**
Hong Kong Tel : 722 4195

**RAINBOW PHOTO FINISHERS PTE LTD.**
Nepal, Kathmandu Tel : 221724

**GENERAL ENTERPRISES COMPANY**
U.A.E., Dubai Tel : 224131/2/3

**MAHMOOD SALEH ABBAR CO.**
Saudi Arabia, Jeddah Tel : (02)6473995

**ARABIAN CAR MARKETING CO.,LTD.**
Oman Tel : 793741

**CASIO COMPUTER CO., LTD.**
Tokyo, Japan

M-9111 RAPCI TL




# నవ్వులు తెప్పించేందుకు 70 రకాలు

nutrine



విశాలమైన నవ్వు

CLARION K-566 TL